Photo by Ravinder Kumar Paul



బహుమతి
పొందిన వ్యాఖ్య

వెలుగుల రాణీ!

పంపినవారు:
ఆర్. పి. రాజు - గొల్లప్రోలు

మనోహరమైన పరిమళమునకు!






మాలిని

రెమి సౌందర్య పరికరాలు

Aykan

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక :
చిత్రకథ, ఫోటో శీర్షికల పోటీ మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



# తిరిగి [illegible] స్వస్థత చేకూరుతుంది!



వాటర్ బరీస్ కాంపౌండ్ టానిక్కును ప్రపంచములో ఆరోగ్యమును వాంఛించు పిన్నలు పెద్దలు అందరూకూడా ఆరోగ్యము నిచ్చుటలో సాటి లేనిదని పేరొందుటచే విడువక వాడుచున్నారు.

వాటర్ బరీస్ కాంపౌండ్ లో ముఖ్యమైన పోషక పదార్థములు కలసి యుండుటచే సౌఖ్యప్రదమగు జీవితమును ప్రసాదించి మీ కుటుంబమునకు అవుసరమైన అదనపు శక్తిని చేకూర్చును.

వాటర్ బరీస్ కాంపౌండ్ ఎడతెగని దగ్గు, పడిశములు, శ్వాసకోశపు రుగ్మతలను నివారించును. వ్యాధినుండి త్వరితముగా కోలుకొనుటకు డాక్టర్లు దీనిని సిఫారసు చేయుచున్నారు.

ఫిల్ ఫర్ - ప్రూఫ్ మూతతో, క్రొత్త ఎఱ్ఱ లేబిల్ తో యిప్పటి సరఫరా.




ఎఱ్ఱ రాపర్ ఇప్పుడు తీసివేయబడినది.

ఆరోగ్యమునకు హితమైన

# వాటర్ బరీస్ కాంపౌండ్

వాడుడు

# ఇది చదివితే మీరు ఆశ్చర్యపడతారు



రోమన్ చక్రవర్తి. నీరో. కాలంలో గాజుగ్లాసు ధర రు. 27,000/- వుండేది ! అభాగ్యుడైన బానిస గ్లాసును పగులగొట్టితే ప్రాణాంతకమే ఆ గ్లాసులే ఇప్పుడు ఒక్కొక్కటి అయిదారు అణాలకు ఏ దుకాణంలోనైనా దొరుకుతున్నాయి.



రాజ భోక్తవమునకు అలవిగాని వస్తువు లున్నాయి. బాబర్ చక్రవర్తి కుమారుడు హుమాయూన్‌కు ఒకమాటు చాలా జబ్బుచేసింది. వైద్యులంతా ఆశ వదులుకొన్నారు. బాబర్ తన కుమారుని పడక చుట్టూ ప్రదక్షిణం చేసి, ఇలా ప్రార్థించాడు: "ఓ దేవా నా కుమారుని రక్షించి నా ప్రాణము



తీసుకో !" ఆయన ప్రార్థన ఫలించింది: ఈనాడు గాజుగ్లాసు అతి చౌకైపోయింది. కాని ఆరోగ్యము, ఇప్పటికీన్నీ, బాబర్ హుమాయూన్ కాలంలోవలెనే, అమూల్యమైయున్నది. అయితే మురికి ఆరోగ్యానికి ఎడతెగని ప్రమాదం. మనము మురికికాకుండా తప్పించుకోలేము. మురికిలో వ్యాధిని గలిగించే క్రిములున్నాయి. లైఫ్‌బాయ్ సబ్బు ఈ క్రిములను కడిగివేసి మీ ఆరోగ్యమును కాపాడును. రోజల్లా హాయిగా నుండుటకు ఎల్లప్పుడూ లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానం చేయండి.




హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి తయారీ.

L. 279-50 TL

## మీ పతిభక్తికి తార్కాణము



కష్టపడి పనిచేసి, 'ఎంతోదూరము ప్రయాణముచేసి అలసిపోయి యింటికి వచ్చిన మీ ఆయనకు సేదదేర్చండి. ఒక కప్పు టీతో ఆరు కరకరలాడే పచ్చని గోధుమ రంగు గ్లూకో బిస్కట్లను యిస్తే ఆయన ఆనందము పొందుతారు. ఆయన విషయములో మీరు తగు జాగ్రత తీసుకోండి. రుచికరమైనవనే కాకుండా, అలసట నిరుత్సాహములను పోగొట్టి శక్తిని చేకూర్చే పార్లెవారి గ్లూకో బిస్కట్లను ఆయనకు పెట్టండి.

జ్ఞాపకముంచుకోండి: శక్తిని పొందుటకు ఆయనకు ప్రతి రోజు ఆరు పార్లెవారి గ్లూకో బిస్కట్లను పెట్టండి.




EVEREST PG.59-28-TL

# పార్లేవారి గ్లూకో బిస్కట్లు

విటమినులు చేర్చబడినవి

పార్లె ప్రోడక్ట్స్ మ్యానుఫ్యాక్చరింగ్ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్., బొంబాయి-24

"ఉతికిన బట్టలు వచ్చాయా ?" అన్నాను.

"ఎలా వున్నాయి ? మెరుస్తున్నాయికదూ ! నా చేతులారా నేనే ఉతికాను" అందావిడ.

అన్ని ఎక్కువ బట్టలా ? అంత తెల్లగానా ? దండాలు కొట్టకుమరీ ! నువ్వుతికే శబ్దం వినపడనంత గాఢ నిద్ర పోలేదు నేను !" అన్నాను; "కాని, ఆవిడవిషయమంతా చెప్పగానే ఆశ్చర్య పడ్డాను !"

## భార్య చెప్పుచున్నది

"కమలను అద్భుతంగా మెచ్చుకున్నాను ! ఆమె మానవులకేగాక బట్టలకూ చికిత్సకురాలనిపించింది.





ఆమె బట్టలగురించి, 'నలుగుడు, చిరుగులు, బొత్తాల విరుపులు, ఇంకా ఎన్నో చెప్పుతుండే ఆనంద పరవశురాలనయ్యాను'',

ఇలా అన్నది: "నీ భర్త అన్నట్లు బట్టల ఆరోగ్యంగురించిన్నీ శ్రద్ధవహించాలి. ఎన్నాళ్లో మురికి బట్టలను ఇంట్లోపడేసివుంచి మనకు కనిపించనిచోట ఉతుకుటకు పంపెయ్య గూడదు. శుద్ధమైన మంచి సబ్బుతో ఇంట్లో మనం ఉతుక్కోవటంతో మరేదీ సాటిలేదు."

"ఇది మంచి మాటే ! కాని ఇంట్లో ఉతుక్కుంటే ఇప్పుడు మీరు ధరించిన చీరంత మెరిసే తెల్లగావుంటుందంటారా ?'' అన్నాను. నా మాట నమ్మ. మా బట్టలన్నిటి లాగే ఈ చీరెను ఇంట్లో నేనే ఉతికాను.'' అని చిరునవ్వుతో జవాబిచ్చింది. "అంతట నన్నామె తనయింటికి తీసుకు వెళ్లింది. అక్కడ ఉతికి ఆరవేసిన మెరిసే బట్టలు కళ్లారా చూశాను !"

"ఎలాగైనా సన్‌లైట్ ధర గురించి ఆలోచిస్తే...'' అంటూంటే ఆమె అందుకున్నది; ''తరుచు బట్టలు చిరిగిపోయి, తరచు కొత్తవి కొనుక్కొనే ఖర్చు ఆలోచిస్తేనో, మరి సన్‌లైట్‌తో ఆభయం లేదు. బట్టలన్నిటినీ బాదక్కర్లేకుండా చక్కగా ఉతుక్కో గలిగేంత సమృద్ధయిన గుణవంతమగు నురగను గలిగిస్తుంది. అందే బట్టలు చాలాకాలం మన్నుతాయి. పైగా, కొద్ది సన్‌లైట్ చాలా బట్టలను తెల్లగాను, కాంతిగాను ఉతుకుతుంది. నీవు తరుచు సబ్బు కొనక్కర్లేదు. ఆలా, రెండు విధాలా ఆదాయం; కాదూ ?"

''నే నింటికొస్తూ ఒక సన్‌లైట్ బిళ్ల కొనుక్కొచ్చి ఈ బట్టలన్నీ ఉతుకుటకు వాడేను. ఇది నిజంగా డాక్టరు సలహాను ఋజువు పర్చింది!'' అన్నాను మా ఆయనతో. మెరుస్తూన్న ఆ తెల్లని బట్టలదొంతర ఆశ్చర్యంగా చాలాసేపు చూశాక, ఆయన అకస్మాత్తుగా ఉత్సాహపడి "ఈ రాత్రిమనం సినీమాకి వెళ్లుదాం, తయారైయుండు, ప్రేయసీ!" అన్నారు.




S/P.4B-50 TL

బొంబాయిలోని హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఉత్పత్తి

# వివాహ మహోత్సవం



1959 ఆగస్టు 7 తేది శుక్రవారం, మద్రాసులోని విజయగార్డెన్స్‌లో "చందమామ" ప్రకాశకులు శ్రీ బి. వేణుగోపాల్ (ప్రఖ్యాత సినీ నిర్మాత శ్రీ బి. నాగిరెడ్డిగారి ద్వితీయ కుమారుడు) కీ, శ్రీ సౌ॥ పద్మావతి (కడప జిల్లా మంటపంపల్లి గ్రామవాస్తవ్యులు శ్రీ పి. రమణారెడ్డిగారి కుమార్తె) కీ వైభవంగా వివాహం జరిగింది. వివాహానికి అనేకమంది సినిమా పెద్దలూ, నటులూ, రాజకీయవేత్తలూ, రచయితలూ, పత్రికాధిపతులూ మొదలైనవారు వచ్చి వధూవరులను ఆశీర్వదించారు.

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

"ప్రశ్నోత్తరాలు" శీర్షిక "చందమామ"ను పాఠకులకు సన్నిహితం చేయగలిగిందనటానికి పాఠకులు మాకు రాసిన అసంఖ్యాకమైన లేఖలే ప్రబల సాక్ష్యం. ఇందువల్ల "చందమామ"కూ పాఠకులకూ కూడా లాభం వుంటుందనుకోవటానికి అవకాశంవున్నది.

కొద్దిమంది పాఠకులు సినిమాలనుగురించి ప్రశ్నలు వేస్తున్నారు, సినిమా శీర్షిక ప్రవేశపెట్టమని కోరుతున్నారు. "చందమామ"లో సినిమా వార్తలకూ, సమాచారాలకూ స్థానం ఇచ్చే అవకాశం లేదు. ఆరు భాషలలో వెలువడుతున్న ఈ పత్రికలో అటువంటి శీర్షిక ప్రవేశపెట్టి పాఠకులందరికీ తృప్తికలిగించేలాగా నిర్వహించటం ప్రస్తుతంలో సాధ్యమయే పనికాదు. సినిమా సమాచారాలు దాదాపు ఇతర పత్రికలన్నిటిలోనూ వస్తున్నాయి గనక "చందమామ"లో లేనందువల్ల యిబ్బంది వుండదని మా విన్నపం.

సంపుటి 25 : సెప్టెంబర్ 1959 : సంచిక 3





CHITRA




# మహాభారతం

మర్నాడు ఉదయం దుర్యోధనుడు సభ చేసి, తన తాతగారైన భీష్ముడితో, "మహానుభావా, నీవు పాండవ సైన్యాన్ని చూశావు గదా! దానిని నీవు ఒక్కడవే ఎంతకాలంలో నిర్మూలించగలవు? అదే విధంగా ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా, కర్ణుడూ ఎంతెంత కాలంలో పాండవసేనను తమ తమ దివ్యాస్త్రాలతో నిర్మూలించగలరో తెలుసుకోవాలని నాకు కుతూహలంగా ఉన్నది!" అన్నాడు.

దానికి భీష్ముడు, "రాజా, నీ పక్షాన యుద్ధంచేసేవారి బలాధిక్యతను తెలుసుకోవటం ఉచితమే. నా శక్తి గురించి చెబుతాను విను. నేను రోజుకు పదివేలమంది యోధులనూ, వెయ్యిమంది రథికులనూ చంపగలను. లక్షల సంఖ్యలో శత్రువులను చంపగల దివ్యాస్త్రాలు నావద్ద ఉన్నవి. వాటినికూడా ప్రయోగించినట్టయితే పాండవ సేనను నాశనం చెయ్యటానికి నాకు ఒక్క మాసం పట్టుతుంది," అన్నాడు.

తరవాత దుర్యోధనుడు ద్రోణాచార్యుణ్ణి అదే విధంగా అడిగాడు. దానికి ద్రోణుడు చిరునవ్వు నవ్వి, "రాజా, నేను ముసలివాణ్ణి అయిపోయాను. నా శక్తి మందగించింది. నేనుకూడా భీష్మునిలాగే ఒక్క నెలలో పాండవసేన యావత్తూ నిర్మూలించగలుగుతాను. అంతకు మించి నాకు శక్తి చాలదు," అన్నాడు.

తరవాత కృపుడు రెండు మాసాలలోనూ, అశ్వత్థామ పది రోజులలోనూ, పాండవ సైన్యాన్ని నిర్మూలిస్తామన్నారు. కర్ణుడు మాత్రం అయిదు రోజులలోనే అంత పనీ చేస్తాననేశాడు. ఈ మాటలు విని భీష్ముడు గట్టిగా నవ్వి, "కృష్ణుడు సారథిగా అర్జునుడు ఎదురుతగిలేదాకా నీవు ఇలాగే ప్రగల్భాలు పలుకుతావు; ఇంతకంటె కూడా గొప్ప

అట్టమీది బొమ్మ





పనులు చేస్తూనే ఉంటావు!" అన్నాడు. కౌరవసభలో జరిగిన ఈ సంభాషణ అంతా చారులవల్ల ధర్మరాజుకు తెలిసింది. ఆయన తన తమ్ములను రహస్యంగా పిలిచి, వారితో భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలూ, కర్ణుడూ అన్న మాటలు చెప్పి, అర్జునుడితో, "నీవు కౌరవసేనను ఎంత కాలంలో నిర్మూలించ గలవు? నాకు తెలుసుకోవాలని ఉన్నది!" అని అడిగాడు.

అర్జునుడు ఒకసారి కృష్ణుడికేసి చూసి ధర్మరాజుతో, "మన ప్రతిపక్షులనుగురించి నీకేమాత్రమూ భయము వద్దు. మనలో మహారథులూ, అతిరథులూ ఉన్నారు. వారు కౌరవసేనలను నిర్మూలించేస్తారు. మహేశ్వరుడు మాయా కిరాతరూపంలో నాతో ద్వంద్వయుద్ధం చేసి నా శక్తికి మెచ్చి ప్రసాదించిన పాశుపతాస్త్రం నావద్ద లేదా? అది ఒక్క క్షణంలో మూడు లోకాలనూ నాశనంచేసే అద్భుతశక్తి కలది. కృష్ణుడి అండ ఉంటే నేనా మహాస్త్రంతో మూడు లోకాలనూ తృటిలో చంపగలను. అలాటి అస్త్రం భీష్మాదులవద్ద లేదు. అయితే మనం అలాటి అస్త్రాలను ప్రయోగించకుండా న్యాయమైన యుద్ధంలోనే శత్రువులను జయించుదాం. మనలో శిఖండీ, యుయుధానుడూ, ధృష్టద్యుమ్నుడూ, భీముడూ, నకుల సహదేవులూ, యుధామన్యుడూ, ఉత్తమౌజుడూ, శంఖుడూ, ఘటోత్కచుడూ, సాత్యకీ, అభిమన్యుడూ, నీవూ, విరాట ద్రుపదులూ, ఉపపాండవులూ కలిసి మూడు లోకాలనూ జయించగలవారు కారా?" అన్నాడు.

మర్నాడు తెల్లవారుతూనే పడమటినుంచి పాండవుల సేనలూ, తూర్పునుంచి కౌరవ సేనలూ బయలుదేరి యుద్ధభూమిని చేరాయి. ఆ సమయాన జంబూద్వీపంలో గల యోధానుయోధు లందరూ కురుక్షేత్రం లోనే ఉండటంచేత మిగిలిన ద్వీపమంతా

నిర్వీర్యమైపోయినట్టయింది. ఉభయపక్షాలా యుద్ధోత్సాహం మిన్నుముట్టుతున్నది. ఆకాశంలో మహాయోధుల ధ్వజాలు మెరుస్తున్నాయి. వారు చేసే శంఖారావాలకు దిక్కులు పిక్కటిల్లుతున్నాయి.

ఉభయపక్షాలవారూ యుద్ధనియమాలు చేసుకున్నారు: పోరాటం జరిగే స్థలాన్ని విడిచిపెట్టి వెళ్లేవాణ్ణి చంపరాదు; రథంపై ఉన్నవాడు రథంపై ఉన్నవాడితోనూ, ఏనుగుపై ఉన్నవాడు ఏనుగుపై ఉన్నవాడితోనూ, అశ్వారూఢుడు అశ్వారూఢుడితోనూ, పదాతి పదాతితోనూ మాత్రమే యుద్ధం చెయ్యాలి; తనను నమ్మి పోరాటం చాలించినవాణ్ణీ, స్పృహ తప్పినవాణ్ణీ కొట్టరాదు; యుద్ధవిముఖుణ్ణీ, శస్త్రకవచాదులు లేనివాణ్ణీ కొట్టరాదు; రథికుడు లేని గుర్రాలనూ, సారథినీ, బాణాలు అందించేవారినీ, శంఖాలూ భేరులూ మోగించేవారినీ కొట్టరాదు.

ఈ సమయంలో వ్యాసమహాముని ధృతరాష్ట్రుణ్ణి చూడవచ్చి, "నాయనా, కాలమహిమవల్ల యోధులందరూ కురుక్షేత్రంలో చేరి యుద్ధంలో చావనున్నారు. నీవు వారికోసం విచారించటం నిరర్థకం. యుద్ధరంగవిశేషాలు సంజయుడు చూసివచ్చి ఎప్పటికప్పుడు నీకు చెబుతూ ఉంటాడు," అని





చెప్పాడు. అలాగే సంజయుడు భారత యుద్ధంసాగిన పద్దెనిమిది రోజులూ యుద్ధ రంగ విశేషాలను ఎప్పటివి అప్పుడు తెలియజేస్తూవచ్చాడు.

అక్కడ యుద్ధరంగాన కౌరవ సర్వ సేనాని అయిన భీష్ముడు, తెల్లని కవచమూ, తలపాగా ధరించి, తాటిచెట్టు జెండా గల రథమెక్కి, తన పక్షాన గల వీరులను ఈ విధంగా సంబోధించి, హెచ్చరించాడు:

"ఓ క్షత్రియ వీరులారా! మీకోసం స్వర్గ ద్వారాలు తెరిచి ఉన్నాయి. ఆ దారిన మీరు ఇంద్రలోకానికీ, బ్రహ్మలోకానికీ పోగలరు. మనకు అనాదిగా వస్తున్న వేదోక్త మార్గమిదే. కనక మీరు భయం విడిచిపెట్టి, యుద్ధంమీదనే దృష్టి నిలిపి, పూర్వం నాభాగుడూ, మాంధాతా, యయాతీ, నహుషుడూ మొదలైనవారు నడిచిన దారినే నడవండి. వ్యాధిగ్రస్తులై, ఇళ్లలో చనిపోవటం క్షత్రియ లక్షణం కాదని మరవకండి!"

కౌరవ సైన్యమంతా ఒక వ్యూహంగా అమర్చబడింది. అందులో వివిధ యోధులు తమకు నిర్ణయించిన స్థానాలలో ఉన్నారు. అది పదకొండు అక్షౌహిణుల సేన.

అవతల అర్జునుడు తమ ఏడు అక్షౌహిణుల సేనను వజ్రమనే వ్యూహంలో అమర్చాడు. అది దుర్జయమైన వ్యూహం.





ఆ వ్యూహంముందు భీముణ్ణి నిలబెట్టాడు. నకుల సహదేవులు భీముడికి చక్రరక్షకులుగా ఉంచబడ్డారు. భీముడి వెనుక పార్శ్వాన్ని రక్షించటానికి ఉపపాండవులూ, అభిమన్యుడూ ఉంచబడ్డారు. వీరందరినీ సర్వసేనాని అయిన ధృష్టద్యుమ్నుడు రక్షించాడు.

రెండు సేనలూ ముందుకు కదలివచ్చి ఒకదాన్ని ఒకటి సమీపించాయి. ఆ సమయానికి సూర్యోదయమయింది.

మహా సముద్రంలాటి కౌరవసేననూ, దానికి నాయకుడైన భీష్ముణ్ణీ చూసి ధర్మరాజు కంగారుపడి అర్జునుణ్ణి తన సమీపానికి పిలిచి, "చూశావా, శత్రుసేన ఎలాటి దుర్భేద్యమైన వ్యూహం పన్ని ఉన్నదో! పైగా వారి పక్షాన భీష్ముడున్నాడు. ఈ సేనను గెలవటం మనవల్ల అవుతుందా?" అని అడిగాడు.

"రాజా, జయానికి బలవీర్యాలు ప్రధానం కావు, ధర్మం ప్రధానం. మన పక్షాన ధర్మం ఉన్నది. పైగా కృష్ణుడు మన పక్షాన ఉన్నాడు. మనకు విజయం తప్పదు!" అని అర్జునుడు ధర్మరాజుకు ధైర్యం చెప్పాడు.

కృష్ణుడు అర్జునుడితో, యుద్ధరంగంలోకి ప్రవేశించేముందు దుర్గాస్తవం చేయమని





సలహా ఇచ్చాడు. అర్జునుడు రథం దిగి, యుద్ధరంగంవేపు తిరిగి, చేతులు జోడించి దుర్గను ధ్యానించాడు. తరవాత తిరిగి రథ మెక్కి, "కృష్ణా, నేను ఎవరెవరితోనైతే యుద్ధం చేయవలసి ఉన్నదో వారందరినీ ఒకసారి చూస్తాను. నా రథాన్ని రెండు సేనల మధ్యకూ తీసుకుపోయి నిలబెట్టు!" అన్నాడు. కృష్ణుడు అలాగే చేశాడు.

అర్జునుడు కౌరవసేనను కలయ చూశాడు. ఎటు చూసినా అతనికి తండ్రులూ, తాతలూ, గురువులూ, మేన మామలూ, అన్నలూ, తమ్ములూ, కొడుకులూ, మనవలూ, మిత్రులూ, తదితర బంధువులూ కనిపించారు. అతను వణికి పోతూ, "కృష్ణా, రాజ్యంకోసమూ, భోగాల కోసమూ నేను చంపవలసింది వీరినా? వీరిని చంపి ఇంద్రభోగాలు సయితం అనుభవించగలనా? కౌరవులు నీచులై వీరందరి వినాశనానికి ఒడిగట్టారుగాని, నేను వీరిని చంపేకంటె వీరిచేత చావటానికే ఇష్టపడతాను. నేను యుద్ధం చెయ్యలేను. గాండీవాన్ని పట్టుకోలేను!" అని దీనాలాపాలాడాడు. అతని కళ్లవెంట నీరు కారసాగింది.

కృష్ణుడు అర్జునుడి బుద్ధిని ఆవరించిన అజ్ఞానాన్ని పోగొట్టటానికి ఎన్నో విషయాలు





చెప్పాడు. "నీవు చంపేవాడవు కావు, వీరు చచ్చేవారూ కారు. మనుషుల దేహాలు ఎలాగూ పోతాయి, అవి క్షణభంగురాలు. ఆత్మకు నాశమనేది ఎన్నడూ లేదు. నీవు చంపేవాడివన్న భ్రమ వదిలిపెట్టి, నీ ధర్మం నీవు చెయ్యి. నీకు కర్మచేసే అధికారమే ఉన్నదిగాని దాని ఫలితంపై అధికారం లేదు," అంటూ కృష్ణుడు ఆత్మనుగురించీ, కర్మనుగురించీ, జ్ఞానంగురించీ, యోగం గురించీ, మోక్షంగురించీ అనేక విషయాలు అర్జునుడికి తెలియజేశాడు.

చివరకు కృష్ణుడు తన విశ్వరూపాన్ని కూడా దివ్యదృష్టిద్వారా అర్జునుడికి చూపించాడు.

కృష్ణుడి హితబోధతో అర్జునుడి భ్రమలూ, భయాలూ, అనుమానాలూ వదిలిపోయాయి; "కృష్ణా, నాకు కర్తవ్యం ఉపదేశించు. నీవు ఏం చెయ్యమంటే అది చేస్తాను!" అన్నాడతడు.

ఇంతలో ధర్మరాజు తన కవచం విప్పేసి, చేతిలోని ఆయుధాన్ని వదిలేసి, రథం దిగి మౌనంగా శత్రుసేనకేసి వెళ్ళసాగాడు. ఇది చూడగానే అర్జునుడూ, భీమ నకుల సహదేవులూ, కృష్ణుడూ, కొంతమంది ఇతర రాజులూ రథాలు దిగి పాండవసేననుంచి బయలుదేరి ధర్మరాజును అనుసరించారు.

"ఈ ప్రయాణం ఎక్కడికి? ఎందుకు? కవచంకూడా లేకుండా శత్రువుల మధ్యకు పోవటం ప్రమాదకరం కాదా?" అని తమ్ములు ధర్మరాజును అడిగారు. కాని ధర్మరాజు వారికి ఏ జవాబూ ఇవ్వకుండా ముందుకు సాగాడు.

కృష్ణుడు ధర్మరాజు భావం గ్రహించి నట్టుగా నవ్వి, "ధర్మరాజు వెళుతున్నది, యుద్ధానికి భీష్మ ద్రోణ కృప శల్యుల అనుమతి పొందటానికి. అలా పెద్దల అనుమతిపై యుద్ధం సాగించటం శ్రేయస్కరం. ఆ సంగతి ఆయనకు తెలుసు!" అన్నాడు.






## 15

[ చంద్రవర్మను చూసి రాజభటులు గొప్ప మాంత్రికుడని భ్రమపడ్డారు. ముసలివాడి దగ్గిరనుంచి, చంద్రవర్మ కంచుకోటకు వెళ్లే మార్గాన్ని తెలిపే పటం తీసుకున్నాడు. తరవాత భటులతో కలిసి. అతడు రుద్రపురం చేరాడు. పురవాసులు చంద్రవర్మను చూస్తూనే 'మహామాంత్రికుడికీ జై!' అంటూ కేకలు పెట్టి స్వాగతంచెప్పారు. తరవాత—]

చంద్రవర్మ రాజప్రాసాదాన్ని సమీపించే సరికి, ముఖద్వారందగ్గిర రాజు శివసింహుడూ, మంత్రులూ, రాజోద్యోగులూ అతడికి ఎదురువచ్చి ఘనంగా స్వాగతం యిచ్చారు. చంద్రవర్మ గుర్రం దిగగానే రాజు అతడిదగ్గిరకు వచ్చి, ఎంతో ఆప్యాయంగా అతడి భుజంమీద చేయివేసి, "చంద్రవర్మా, ఇంత చిన్న వయసులో, నీఅంత గొప్ప మంత్రవేత్తలయినవాళ్లు ఏ కాలంలోనూ లేరనుకుంటాను. నా రాజ్యపు సరిహద్దుల్లో నివాసం ఏర్పరచుకుని, మహాకంటకుడుగా తయారైన శంఖుణ్ణి నీవు హతమార్చటం చూసి, నేనూ నాప్రజలూ చాలా ఆనందపడ్డాం," అన్నాడు.

రాజు శివసింహుడు యిలా అనగానే చంద్రవర్మ ఎంతో ఆశ్చర్యపోయాడు. కాని, అతడు తన ఆశ్చర్యాన్ని బయటికి కనబరచకుండా చిరునవ్వు నవ్వి, "ఆ శంఖుడు పరమ దుష్టుడు, మహాపాపి. అందుకే వాణ్ణి యమపురికి పంపాను," అన్నాడు.



"ఆ శంఖుడి కొండపై ప్రస్తుతం వుంటున్న నీ స్నేహితుడు కాలకేతుడిద్వారా నిన్నుగురించి సర్వం తెలుసుకున్నాను. ఆతడి సలహాను పాటించే నిన్ను కంచుకోటకు వెళ్ళిరావలసిందిగా కోరేందుకు, నా భటులచేత యిక్కడికి ఆహ్వానించటం జరిగింది," అన్నాడు శివసింహుడు.

"కంచుకోట! అదెంత పని!" అంటూ చంద్రవర్మ చిరునవ్వు నవ్వాడు. అంతలో మంత్రి రాజు చెవిలో ఏదో చెప్పగానే, రాజు ప్రాసాదంకేసి నడుస్తూ, "చంద్రవర్మా! నువ్వు ప్రయాణబడలికలో వుండివుంటావు. భోజనం చేసి విశ్రాంతి తీసుకున్నతరవాత



అన్ని సంగతులూ వివరంగా మాట్లాడుకుందాం," అన్నాడు.

చంద్రవర్మకు రాజగృహంలో చక్కని విడిది ఏర్పాటు చేయబడింది. అతడు స్నానం ముగించి రాగానే, రకరకాల పిండి వంటలతో భోజనంపెట్టారు. తరవాత చంద్రవర్మ పట్టువరువులూ, బాలీశులూ పరిచి వున్న మంచంమీద పడుకుని నిద్రపోయేందుకు ప్రయత్నించాడు. కాని, అతడికి ఎంతకీ నిద్రపట్టలేదు. శంఖుడి కొండమీద వుంటున్న కాపాలినీ, కాలకేతులద్వారా శివసింహుడు తననుగురించి కొంత తెలుసుకున్నాడు. కంచుకోటను చేరగలవాడు తనొక్కడే అని కాలకేతుడు శివసింహుడితో చెప్పటంలో వున్న రహస్యం ఏమిటి?

ఈ విషయాన్నిగురించి కొంచెంసేపు తీవ్రంగా ఆలోచించేసరికి, చంద్రవర్మకు కాలకేతుడి ఎత్తుగడ ఏమిటో తెలిసిపోయింది. తను తిరిగీ రాజ్యం జయించుకునేందుకు డబ్బూ, బలగమూ కావాలి. వాటిని సంపాయించటానికి కంచుకోటలో వున్నవని చెప్పబడే ధనరాసులు ఎంతో సహాయపడతవి.

చంద్రవర్మ యిలాంటి ఆలోచనల్లో వుండగా సేవకుడొకడు వచ్చి, రాజుగారూ,







ప్రధానమంత్రి అతడికోసం సమాలోచన మందిరంలో వేచివున్నట్టుగా వర్తమానం చెప్పిపోయాడు. చంద్రవర్మ కొద్దిసేపటికల్లా సమాలోచన మందిరానికి వెళ్ళాడు.

"చంద్రవర్మా, నేను కంచుకోటలోవున్న ధనరాసులకోసం ఆశించటంలేదు. ఆ సంగతి ముందుగానే నీతో చెప్పటం మంచిదని చెప్తున్నాను," అన్నాడు రాజు శివసింహుడు. చంద్రవర్మ తలాడించి వూరుకున్నాడు.

"అయితే, ఆ కంచుకోటనుగురించి నాకింత ఆసక్తి ఎందుకన్న ప్రశ్న వస్తుంది. దానికి నేనివ్వబోయే సమాధానం కొంత చిత్రంగా వుండవొచ్చు. కాని, అది ముమ్మాటికీ సత్యం. ఆ కంచుకోట సముద్రతీరాన వున్నదని తెలుసుగదా?" అన్నాడు రాజు.

"అవును, పడమటి సముద్రతీరం. వెయ్యేసంవత్సరాల ఈమధ్య దానిని చూసిన మానవమాత్రు డెవడూ లేడు," అన్నాడు చంద్రవర్మ.

ఈ మాటలు వింటూనే మంత్రి ఆశ్చర్యంగా రాజుకేసి చూశాడు. రాజు తల పంకించి, "కావొచ్చు. ఆ కంచుకోట గోడలను ఒకపక్క సముద్రజలం తాకుతూ వుంటుందని చాలామంది నమ్మకం, అవునా?" అన్నాడు.

"అలా అనే నేనూ విన్నాను," అన్నాడు చంద్రవర్మ.

"ఆ గోడపక్కన వున్న సముద్రజలంలో, ఒక మాంత్రికుడివల్ల కంచుకుండల్లో బంధించబడిన కొన్ని అపురూప ప్రాణులు వున్నవని మా పూర్వీకుల నమ్మకం. మా తండ్రిగారు వాటికోసం ఎంతో ప్రయత్నించారు. కాని ఫలితం కలగలేదు. ఇచ్ఛామాత్రంగా మానవరూపాన్నీ, అంతలోనే మహా కాలనాగురూపాన్నీ ధరించగల నీ స్నేహితుడు కాలకేతుడిద్వారా, ఆ కంచుకుండలను నువ్వు తేగలవన్న ఆశ నాకు కలిగింది," అన్నాడు రాజు శివసింహుడు.





రాజు మాటలు వింటూనే చంద్రవర్మ యిందులో పెద్ద మోసం వున్నదని గ్రహించాడు. అపురూప ప్రాణులున్నవని చెప్పబడే కంచుకుండలకోసం ఎవరూ యింత శ్రమ పడరు. శివసింహుడికి కావలసింది కంచుకోటలో వున్నదనబడే ధనం. దానిని సాధించటం అతడివల్ల కాక, మంత్రశక్తు లున్నవని భ్రమపడి తన సహాయం కోరుతున్నాడు. నిజంగానే కంచుకోటలో ధనరాసులు దొరికితే, వాటిని శివసింహుడి పాల పడకుండా, మోసానికి ప్రతిగా మరింత మోసాన్ని ప్రయోగించి తనవిగా చేసుకోగలనన్న ధైర్యం చంద్రపాలుడికి కలిగింది.

"నాబోటి మంత్రవేత్తలకు కావలసింది, యిటువంటి కష్టసాధ్యమైన కార్యాలను సాధించటమే. నేను కంచుకోటకు వెళతాను. నావెంట కొద్ది సిబ్బందిని పంపండి. వాళ్లల్లో దేవలుడనే యువకుడు కూడా వుంటటం అవసరం!" అంటూ చంద్రవర్మ తన అరచేతికేసి పరీక్షగా చూసుకున్నాడు.

రాజు శివసింహుడూ, మంత్రీ ముఖముఖాలు చూసుకున్నారు. ఓ క్షణకాలం ఆగి రాజు చంద్రవర్మతో, "ఆ దేవలుడి తండ్రి అయిన ముసలివాడు అరణ్యంలో తిరుగుతున్నాడు. వాణ్ణి నువ్వు కలుసుకున్నావా?" అన్నాడు.





"ఎవడా ముసలివాడు? ఓహో ..." అంటూ చంద్రవర్మ తన అరచేతికేసి మరింత తీవ్రంగా చూసి, "అతడు అడవిలోని ఒక పూరిగుడిసెలో వున్నాడు. అతడికి అవసరమైన సౌకర్యాలన్నీ కలిగించండి. ఒకవేళ అతడు నగరానికి వచ్చి వుంటానంటే, అందుకు అవసరం అయిన ఏర్పాట్లు చేయండి. నేను కంచుకోటను చేరగలగటం, ఆ ముసలివాడిమీదా, అతడి కొడుకు దేవలుడిమీదా ఆధారపడి వున్నది," అన్నాడు.

చంద్రవర్మ చెప్పినదానికి రాజుగాని మంత్రిగాని కిక్కురుమనలేదు. "అలాగే, అలాగే. నువ్వు చెప్పినట్టే చేస్తాను. దేవలుణ్ణి నువ్వు వెంటపెట్టుకు పోవచ్చు. నీకు రక్షణగా ఒక వెయ్యిమంది సైనికులు వుంటే సరిపోతుందా?" అన్నాడు రాజు.

ఆ మాటలకు చంద్రవర్మ బిగ్గరగా నవ్వి, "నేను వెళుతున్నది ఎవరిమీదా యుద్ధానికి కాదు. ఒకవేళ యుద్ధమే చేయవలసివస్తే... అది అదృశ్యంగా వుండి నా మార్గాన్ని అటకాయించే దుష్టశక్తులమీద చేయవలసివస్తుంది. దానికి నా మంత్రశక్తి తప్ప, మీ సైనికులు ఏమాత్రం సహాయకారులు కారు. నాకు కావలసిందల్లా ఆహారపదార్థాలు మోసేందుకు కొన్ని గాడిదలూ, వాటిని తోలేవాళ్లూ. నావెంట ఓ పదిమంది అనుచరులుంటే






సరిపోతుంది. వాళ్లు సైనికులే కానవసరం లేదు," అన్నాడు.

"అలా కాదు. నా ఉద్యోగుల్లో సమ్మకస్థులనూ, ధైర్యసాహసాలు కలవాళ్లుగా చూసి నలుగురైదుగురిని నీవెంట పంపుతాను. వారి వెంట ఓ యాభైమంది సైనికులుంటారు. నారాజ్యపు ఎల్లలు దాటి నువ్వు పడమటి కనుమలు ప్రవేశించే ముందు, ఆ ప్రాంతాలకు మండలాధీశుడుగా వున్న వీరమల్లుడు, నీకు కావలసిన యితర సహాయమేదైనా వుంటే, అది చేస్తాడు," అన్నాడు రాజు.

వీరమల్లుడన్న పేరు వింటూనే చంద్రవర్మకు తన సేనానాయకుడు ధీరమల్లుడి



పేరు గుర్తుకొచ్చింది. అతడూ, తనకు విశ్వాసపాత్రుడైన సేవకుడు సుబాహుడూ ఏమైపోయారో అని చంద్రవర్మ విచారంగా ఒక నిట్టూర్పు విడిచాడు.

"మహారాజా, మీకు తోచిన విధంగా చేయండి. రేపు సూర్యోదయంవేళ నా ప్రయాణం. కంచుకోటకు వెళ్లేలోపల నేను మహారణ్యాలనూ, కొండలనూ, ఎడారులనూ దాటవలసివుంటుంది. ఆహారపదార్థాలను మోసే జంతువులను, ఏప్రాంతానికి తగిన వాటిని ఆ ప్రాంతంలో నేను ఉపయోగించవలసివుంటుంది. ఎడారుల్లో ప్రయాణం చేటప్పుడు నాకు ఒంటెల అవసరంకూడా కలగవచ్చు. ఆ ఏర్పాట్లన్నీ సరిహద్దుల్లో వున్న మీ మండలాధిపతి వీరమల్లుడు చూసేలా ఏర్పాటు చేయండి," అన్నాడు చంద్రవర్మ.

"అవన్నీ నేను చూస్తాను. నువ్వేమీ అదుర్దా పడనవసరంలేదు," అన్నాడు రాజు శివసింహుడు.

మర్నాటి ఉదయం కంచుకోట దిక్కుగా చంద్రవర్మ ప్రయాణం ప్రారంభమైంది. శివపురం పొలిమేరలవరకూ రాజూ, మంత్రులూ, ప్రజలూ వెంటవచ్చి చంద్రవర్మను సాగనంపారు. అతడి వెంట





ముఖ్యానుచరుడుగా ముసలివాడి కొడుకు దేవలుడున్నాడు. అతణ్ణి ఆ కిందటి రాత్రే కారాగారంనుంచి విడుదల చేశారు.

అడవులగుండా చంద్రవర్మ కొన్ని యోజనాల దూరం ప్రయాణం చేశాడు. అతడికి ముసలివాడు యిచ్చిన పటం మార్గాన్ని తెలుసుకునేందుకు అంతగా వుపయోగించలేదు. కీకారణ్యాలూ, ఎత్తయిన కొండలూ తప్ప చంద్రవర్మకు ఎక్కడా మానవ సంచారం కనిపించలేదు. తను పడమటి దిక్కుగా పోతున్నదీ, లేక మార్గం తప్పినదీ తెలుసుకునేందుకు అతడికి సూర్యోదయం, సూర్యాస్తమయాలే గుర్తులు.

ఇలా కొన్ని దినాలు ప్రయాణించిన తరవాత ఒకనాటి సూర్యోదయంవేళ దేవలుడు ఒక ఎత్తయిన రాతిమీదనుంచి పెద్దగా చప్పట్లు చరుస్తూ, "ఇదుగో, మనం ఏదో శిథిలనగరాన్ని చేరాం. ఇదే కంచుకోట కావచ్చు!" అని కేకలు పెట్టాడు.

ఆ కేకలు వింటూనే, చంద్రవర్మా అతడి వెంటవున్న రాజోద్యోగులూ పరిగెత్తుకుంటూ దేవలుడున్నచోటుకు వెళ్లి, అతడు చెప్పిన దిక్కుగా దృష్టి సారించారు. ఎదురుగా కొండదిగువను శిథిలావస్థలో వున్న ఒక మహానగరం వారి కంటబడింది. పడిపోయిన గోడలూ, ఒక పక్కకు ఒరిగి కూలటానికి సిద్ధంగా వున్న ఇంటి కప్పులూ, వాటిమధ్య చిత్తవొత్తుగా పెరిగిన చెట్లు చేమలూ—ఆ ప్రదేశమంతా భీతి కొల్పేలా వున్నది.

"ఇది కంచుకోట కాదు. అయినా, మనం ఒకసారి ఆ శిథిలగృహాలను పరీక్షించి చూడటం మంచిది. నావెంటరండి!" అంటూ చంద్రవర్మ రాతిమీదినుంచి దిగి శిథిల గృహాలకేసి బయలుదేరాడు.

అందరూ కలిసి వాటిని సమీపించేసరికి ఒకానొక పాడుపడ్డ యింటిముందు ఆడుకుంటూవున్న మూడు పులిపిల్లలు వారికి కనిపించినై. అవి చంద్రవర్మనూ, అతడి





వెంట వున్నవారినీ చూస్తూనే బుసలుకొట్టి ఒక్క గంతులో రాళ్లవెనకకు పారిపోయినై. ఆ మరుక్షణం పులి పెద్దగా గాండ్రించిన చప్పుడు వినబడింది.

ఆ ధ్వని వింటూనే చంద్రవర్మ తక్కున ఆగి, "మనం ఈ ఇంటిని సమీపించటం క్షేమంకాదు. మరోవైపుగా వెళదాం," అంటూ ఇంకో దిక్కుగా దారితీశాడు

దాదాపు అయిదారు మైళ్ళ వైశాల్యం వున్న ఆ శిథిలనగరంలో వారికెక్కడా మానవమాత్రుడున్న సూచనలు కనిపించలేదు. అక్కడ వున్న ప్రతి గృహం శిథిలావస్థలోనే వున్నది. కొన్ని కాలిపోయి నల్లగా మసిపూసినట్టున్నవి. ఒకప్పుడు మానవులు నివసించిన ఆ గృహాల్లో యిప్పుడు అడవి పందులూ, చిరుతపులులూలాంటి అడవి మృగాలు స్థావరం ఏర్పరుచుకున్నవి.

చంద్రవర్మ నగరంమధ్యకు వచ్చేసరికి అక్కడ ఎత్తయిన ఒక శిలాఫలకం కనిపించింది. దానిమీద కనిపించీ కనిపించనట్టుగా కొన్ని అక్షరాలు చెక్కబడివున్నవి. చంద్రవర్మ శిలాఫలకాన్ని సమీపించి అక్షరం అక్షరాన్నీ కూడబలుక్కుంటూ మొత్తం శాసనాన్ని చదివాడు. అందులో వున్న ముఖ్య విషయం యిది :

ఇది కరవీరపురము. వెయ్యి సంవత్సరాలు సర్వసంపదలతో తులతూగిన ఈ నగరాన్ని ఉత్తర దిశనుంచి వచ్చిన బర్బరులనబడే జాతివారు కొల్లగొట్టి, ఆ ధనాన్ని తమ రాజధాని కంచుకోటకు చేరవేశారు.

చంద్రవర్మ శాసనాన్ని చదివి తన అనుచరులకేసి తిరిగి, "ఇక మనం యిక్కడ కాలాన్ని వృథాపుచ్చటం మంచిదికాదు. ఈ శిథిలనగరంలో రాళ్లూ రప్పలూ తప్ప మరేం లేవు. ఇది కంచుకోట కాదు. బయలుదేరండి," అన్నాడు. అందరూ తిరిగి పడమటిదిక్కుగా ప్రయాణమయారు.

—(ఇంకా వుంది)



# జంబూక యోగీశ్వరుడు

పట్టు విడవని విక్రమార్కుడు మరొకసారి చెట్టువద్దకు వెళ్లి, శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగే శ్మశానంకేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు చేసే ఈ పని మంచిదో చెడ్డదో ఆలోచించుకున్నావా? ఎందుచేత నంటే, కొందరు జంబూకుడిలాగా సద్బుద్ధి తోనే కూడని పనులు చేస్తారు. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు ఆ జంబూ కుడి కథ చెబుతాను విను," అంటూ ఈవిధంగా చెప్పసాగాడు :

పూర్వం హిరణ్యా పర్వతప్రాంతంలో యోగులకు ఒక ఆశ్రమం వుండేది. అందులో దాదాపు వెయ్యిమంది యోగులు కుటీరాలు నిర్మించుకుని నివసిస్తూ ఉండేవారు. దీనిని కొంతకాలం రాజుగారు పోషించాడు, కాని రానురాను దేశంలో అరాజకం ఏర్పడి ఆశ్రమం నిరాధారమైపోయింది. ఆశ్రమా

## బేతాళ కథలు

నికి వుండిన ఆవుల మందలు క్షీణించి పోయాయి. ఆశ్రమంలో వుండేవారు చింకి గుడ్డలు ధరించవలసివచ్చింది. యోగుల గురువు ఏవిధమైన సహాయమైనా లభి స్తుందా అని ఎంతో ప్రయత్నించాడు, కాని ఆశ్రమానికి ఎవరూ తోడ్పడలేదు.

ఈ ఆశ్రమంలో వుండే గోవులను చూసే టందుకు జంబూకుడనేవాడు వుండేవాడు. వాడికి చిన్నతనంలోనే తల్లిదండ్రులు పోయారు. కొంతకాలం వాణ్ణి నాయనమ్మ పెంచి ఆమెకూడా చనిపోయింది. ఆ తర వాత వాడు బొత్తిగా అనాథ అయిపోయి గాలికి తిరుగుతూండగా యోగుల గురువు చూసి వాణ్ణి ఆశ్రమానికి తెచ్చి పశువులను చూసేపని ఇచ్చాడు.

అదిమొదలు జంబూకుడు ఆశ్రమంలోని ఇతర యోగులతోపాటు వుంటూ పశువులను కాస్తూ, దైవప్రార్థనలు చేస్తూ కాలక్షేపం చేస్తున్నాడు.

ఆర్థికంగా ఆశ్రమవాసులు పడుతున్న అగచాట్లు జంబూకుడు చూస్తూనే వున్నాడు. ఒకనాడు వాడి కొక ఉపాయం తోచింది. వాడు గురువువద్దకు వెళ్ళి, "గురూజీ, మనకు డబ్బుఇబ్బంది లేకుండా వుండా లంటే ఒకపని చేయవచ్చునని నాకు తోస్తు న్నది," అన్నాడు.



"ఏమిటి, నాయనా, అదీ?" అని గురువు ఆశ్చర్యంగా అడిగాడు.

"మా నాయనమ్మ కాపు పెట్టి ఒక ద్రావకం తయారుచేసేది. దాన్ని అమృత సారం అనేవాళ్లు. ఎంతోమంది ధనికులు ఆవిడచేత అమృతసారం కాయించుకునే వారు. చాలాకాలం నేనుకూడా ఆవిడకు తోడుగా పనిచేశాను. ఇద్దరమూ ఊరిబయ టికి వెళ్ళి రకరకాల మూలికలు ఏరి తెచ్చే వాళ్ళం. ఆ మూలికలన్నీ మన పశువులు మేసే కొండప్రాంతంలో ఉన్నాయి. వాటిని నేను రోజూ చూస్తూనేవుంటాను. ఇప్పుడు నాకు తట్టినదేమంటే మన ఆశ్రమంలో ఈ అమృతసారం తయారుచేసి లాభానికి అమ్మినట్టయితే మనకు ఒకరి సహాయం అవసరం వుండదు! సుఖంగా బతకవచ్చు," అన్నాడు జంబూకుడు.

"అమృతసారం ఎలా కాయాలో నీకింకా జ్ఞాపకం వున్నదా, నాయనా?" అని గురువు అడిగాడు. పూర్తిగా జ్ఞాపకం ఉన్నదన్నాడు జంబూకుడు. వెంటనే పెద్ద యోగులందరూ చేరి, అమృతసారం ఆశ్రమంలో తయారు చేసి విక్రయించటానికి నిర్ధారణ చేశారు.

పశువులను కాసే పని మరొక మనిషికి వప్పగించి జంబూకుడు అమృతసారం కాయటానికి పూనుకున్నాడు. ఈ పనికిగాను






ప్రత్యేకంగా ఒక కుటీరం ఆశ్రమానికి కొంచెం దూరంగా నిర్మించారు. అందులో జంబూకుడు తప్ప మరెవరూ ప్రవేశించటానికి లేదు. అక్కడ అతను బట్టీ ఏర్పాటు చేసుకున్నాడు, అవసరమైన మూలికలను తానే స్వయంగా వెతికి తెచ్చుకున్నాడు. త్వరలోనే కళాయిలో అమృతసారం తయారయింది. దానిని కొద్దిగా చవిచూసి జంబూకుడు గురువద్దకు వెళ్ళి, "గురూజీ, అమృతసారం తయారయింది. కాపూ, పాకమూ చాలా బాగా కుదిరాయి," అన్నాడు.

పెద్ద యోగులంతా కలిసి లెక్కలు కట్టారు. తయారుచెయ్యటానికి అయే ఖర్చుకు పదింతల ధరకు దాన్ని అమ్మటానికి నిర్ణయంజరిగింది. తయారైన అమృతసారాన్ని నాలుగు బుడ్డీలలో నింపి నలుగురు సంపన్నులవద్దకు పంపి అమ్మించారు. ఆ సంపన్నులు అటువంటి పానీయం ఎన్నడూ రుచిచూడలేదు.

అమృతసారం ఖ్యాతి త్వరలోనే వాడవాడలా పాకింది. రోజుకు పదేసి బుడ్లు అమ్మిన అమృతసారం, పంద బుడ్లు అమ్మింది. వంద బుడ్లు చూస్తూండగానే అయిదువందలయాయి. చివరకు రోజుకు వెయ్యిబుడ్లు తయారుచేసినా చాలని స్థితి ఏర్పడింది. రాజాధిరాజుల దగ్గిరనుంచీ ఒక మాదిరి జరుగుబాటు గల కుటుంబాలవరకూ ప్రతివాళ్ళూ తమ ఇంట రెండు మూడు బుడ్లు అమృతసారం దాచివుంచసాగారు.

ప్రతి పండగకూ, ఉత్సవానికీ, పెళ్ళిళ్ళు మొదలైన శుభకార్యాలకూ అమృతసారం జాస్తిగా ఖర్చవుతూండేది.

ఆశ్రమంలో కనకవర్షం కురుస్తున్నది. అక్కడవున్న చిన్నచిన్న కుటీరాలుపోయి, మేడలూ మిద్దెలూ వచ్చాయి.

ఆశ్రమాని కిప్పుడు రెండువేల ఆవులు ఏర్పడ్డాయి. అందరికీ ఒంటినిండా బట్టా, కడుపునిండా తిండీ వున్నది.

అమృతసారం తయారుచెయ్యటాని కిప్పు డొక పెద్ద భవంతి ఏర్పాటయింది. మూలి కలు తీసుకురావటానికి ముప్పైమంది మనుషులను జీతాలిచ్చిపెట్టారు. కాని బట్టీ వద్ద వుండే పని జంబూకుడికి తప్పలేదు. కాపు ఎంత వుండాలో అది అతనికి ఒక్కడికే తెలుసు. అతను రోజల్లా బట్టీవద్దనే వున్న ప్పటికీ పెద్ద యోగులు అతనికికూడా తమతో సమానమైన హోదా ఇచ్చి గౌరవించారు.

ఒకనాటి రాత్రి ప్రార్థనలు జరిగే చోటికి జంబూకుడు తూలుతూ వచ్చి, "ఏయ్, ఏంచేస్తున్నారు మీరంతా?" అని గట్టిగా అరవసాగాడు.

"మన జంబూకయోగిని ఏదో గాలి సోకి నట్టున్నది! అవతలికి తీసుకువెళ్ళండి!" అన్నాడు గురువు.

మర్నాడు ఉదయం జంబూకుడు గురువు వద్దకు వెళ్ళి ఆయన పాదాలపైపడి, "గురూజీ, నన్ను మన్నించండి! ఈ అమృత సారం చాలా పాపిష్టిది. దానిప్రభావంచేతనే నేను నిన్న రాత్రి అసభ్యంగా ప్రవర్తిం చాను. మీ అందరి సాంగత్యమూ చేస్తూ, మీ సహాయంతో ఆత్మదర్శనం చేసుకోవలి సిన నేను ఆ పాపిష్టి పానీయం తయారు చేస్తూ రోజల్లా గడిపి నరకమార్గాన పోతు



న్నాను. దయచేసి, నా ఆవులను నా కిప్పిం చండి!" అన్నాడు.

గురువు పెద్ద యోగులనందరినీ పిలి పించి, జంబూకుడు అంటున్న మాటలను వారికి చెప్పాడు.

"అయ్యో, జంబూకయోగీశ్వరా! ఈ అమృతసారం చేయటం నీవల్ల తప్ప మరొకరివల్ల కాదు; ఆవులను ఎవరైనా కాయవచ్చు! అమృతసారం చేయటం మానేశామంటే మనం పడే తిప్పలు అంతా ఇంతా కాదు. మనం లోగడ అనుభవించిన దారిద్ర్యాన్ని కొంచెం గుర్తుకు తెచ్చుకో!" అన్నారు పెద్ద యోగులు.

గురువు జంబూకుడికేసి తిరిగి, "నాయనా, ఈ అమృతసారాన్ని నీవు తయారు చేస్తేమాత్రం దాన్ని తాగవలిసిన అవసరమేమున్నదీ ?" అని అడిగాడు.

"గురూజీ, దినుసులు సరిఅయిన పాళ్ళలో పడినదీ లేనిదీ చూసి తెలుసుకోగలనుగాని, కాపు సరిపోయినదీ లేనిదీ జిహ్వకుమాత్రమే తెలుస్తుంది. అందుచేత బట్టీదించినప్పుడల్లా అమృతసారాన్ని రుచి చూడక నాకు తప్పదు!" అన్నాడు జంబూకుడు.

"అలా అయితే అందుకు పది చుక్కలో, ఇరవై చుక్కలో ఎంచి రుచిచూడు. అంత మాత్రంచేత అది కీడు చేయలేదనుకుంటాను!" అన్నాడు గురువు.

జంబూకుడు సరేనన్నట్టు తల ఊపాడు. యోగులందరూ ఒక పెద్ద ఆపద తప్పిపోయినట్టుగా నిట్టూర్పులు వదిలారు.

మరి కొంతకాలం గడిచింది. మళ్లీ రాత్రి ప్రార్థనలు జరిగేచోటికి జంబూకుడు పల్లె పాటలు గట్టిగా పాడుతూ, మధ్యమధ్య వెకిలిగా నవ్వుతూ వచ్చాడు. అతను తప్ప తాగి ఉన్నాడు. కొంతమంది అతన్ని ఇంటికి చేర్చి నిద్రపుచ్చారు. అప్పటికప్పుడే గురువు పెద్ద యోగులను చేర్చి సమాలోచన చేశాడు. వారు ఆయనతో, "నూరు ఆరైనా, ఆరు



నూరైనా అమృతసారం తయారు అయి తీరవలిసిందే!" అన్నారు.

మర్నాడు ఉదయం జంబూకుడు మళ్ళీ వచ్చి గురువుగారి పాదాలపై పడి, "గురూజీ, నన్ను మహానరకంనుంచి మీరే రక్షించాలి. ఇక నేనా బట్టీ దగ్గిరికి చచ్చినాపోను! దీని కోసం నేను ఉత్తమ లోకాలు పోగొట్టుకో లేను!" అన్నాడు.

"ఇప్పుడేం వచ్చింది, నాయనా? అమృత సారం కొద్ది చుక్కలుమాత్రమే రుచి చూడమని చెప్పానుగదా! అలాగే చేస్తు న్నావా?" అని గురువు అడిగాడు, ఏమీ తెలియనివాడల్లే.

"ఇరవై చుక్కలు రుచి చూశాక అది నన్ను వదులుతుందా, గురూ? దాని వాసనే చాలునే పతనం కావటానికి! దాన్ని కళ్ళతో చూడటంకూడా పాపమే, నన్నడిగితే! అందుచేత నాకు ఆవులు కాసేపనిగాని, లేక మరొక పని ఏదైనాసరే ఇప్పించండి!" అన్నాడు జంబూకుడు.

"పిచ్చివాడా, భయపడకు! మేమంతా ప్రార్థనలు చేసే సమయంలో మాకోసం నీవు ఏ పాతకం చేసినా అది నిన్ను అంటదు. నిన్ను కుంభీపాక నరకంనుంచికూడా ఊర్ధ్వలోకాలకు లాగే యోగశక్తి నావద్ద ఉన్నది. కనుక నీవు నిశ్చింతగా కుటీరానికి



వెళ్లి నీ అమృతసారం సంగతి చూసుకో !" అన్నాడు గురువు.

అదిమొదలు జంబూకుడు పాపభయం ఎరగకుండా, భారమంతా గురువుపైన వేసి అమృతసారం తయారు చేయసాగాడు. అతను చీకటి పడేసరికి తప్పతాగి ఉండే వాడు, కాని ప్రార్థనలు చేసేచోటికి వెళ్లే వాడుకాడు. తాగినమైకంలో ఎక్కడ ఒళ్లు తెలియకపోతే అక్కడే పడిపోయేవాడు. మిగిలినవాళ్లు చూసి అతన్ని ఇంటికి చేర్చుతూవుండేవారు.

కాలక్రమాన యోగులంతా సమాధిచెంది నరకానికి వెళ్లారు. యోగుల గురువు నరకానికి వెళ్లే దారిలో అలా స్వర్గంలోకి తొంగి చూసేసరికి అక్కడ ఒక కల్పవృక్షంకింద కూచునిఉన్న జంబూకుడు కనిపించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఏ పాపమూ చెయ్యని యోగులందరూ నరకానికి పోతే రోజూ తప్పతాగిన జంబూకుడు స్వర్గానికి వెళ్లటానికి కారణమేమిటి? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీతల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "జంబూకుడు తప్పతాగినా ఆశ్రమనియమాలకూ, గురువు ఆదేశానికీ కట్టుబడే ఆ పాపం చేశాడు. అతని మనసుమాత్రం అనుక్షణమూ ఉత్తమ లోకాలమీదనే ఉన్నది. మిగిలిన యోగులు అలా కాదు. వారి మనస్సు ఎంతసేపూ పాపిష్టి డబ్బుపైనే ఉన్నది. వారు ఉత్తమ లోకాలనుగురించి ఎన్నడూ ఆలోచించ లేదు. అందుచేతనే వారు నరకానికి వెళ్లారు. జంబూకుడు దౌర్బల్యంకొద్దీ తాగాడే గాని తాగుడు పాపిష్టిదని అతనికి ఎప్పుడూ తెలుసు. అందుకే అతను స్వర్గానికి వెళ్లాడు!" అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)






# ఆదర్శ ప్రేమికులు

వెరోనానగరంలో ఒకప్పుడు రెండు గొప్ప కుటుంబాలుండేవి. వారిమధ్య పచ్చిగడ్డి వేస్తే భగ్గుమంటూండేది. ఆ కుటుంబాలకు చెందినవారే గాక, వారి దూరపు బంధువులూ, చివరకు వారి నౌకర్లు సయితం ఎక్కడ తారసిల్లితే అక్కడ పోట్లాటలకు తలపడేవారు. ఒక్కొక్కప్పుడు నడివీధులలో రక్తపాతాలుకూడా జరుగుతూండేవి. ఈ తగాదా ఆ వంశాలమధ్య అనాదిగా ఉండి ఎంతకూ సమసిపోయేటట్టు కనపడలేదు.

ఈ రెండు ఇళ్లలోనూ ఒక ఇంట జూలియెట్ అనే పిల్ల ఉండేది. ఆమె అపురూప సౌందర్యవతి. తండ్రికి ఒక్కతే కుమార్తె, పెద్ద ఆస్తికి వారసురాలు. రెండవ ఇంటికి చెందినవాడు రోమియో.

ఇతను రోజలీన్ అనే గొప్పయింటి కన్య నొకదానిని ప్రేమించి, ఆమెచేత నిరాకరించబడి, నిద్రాహారాలులేక వెర్రివాడైపోయాడు.

ఇలా ఉండగా జూలియెట్ తండ్రి ఒక బ్రహ్మాండమైన విందు వినోదం ఏర్పాటు చేసి, రోమియో ఇంటివారిని తప్ప మిగతా వెరోనా నగరవాసులందరినీ సకుటుంబంగా ఆహ్వానించాడు.

రోమియో మిత్రుడొకడు, బెన్వోలియో అనేవాడు, రోమియోతో, "వెరోనానగరంలో నీ రోజలీనాను తలదన్నే అందగత్తెలు ఎంతో మంది ఉన్నారు. ఇవాళ మనం మారు వేషాలతో విందుకు వెళితే అందరినీ చూడవచ్చు!" అన్నాడు.

ఇతర కన్యలను చూడటానికి కాకపోయినా తన రోజలీనాను చూడవచ్చునన్న ఆశతో రోమియో ఒప్పుకున్నాడు. నిజానికి అతనికి తమ ప్రతిపక్షులపైన విద్రోహభావం ఏమీలేదు. అతను బెన్వోలియోనూ,

విలియం షేక్స్పియర్

మెర్క్యూషియో అనే మరొక మిత్రుణ్ణి వెంట తీసుకుని, కళ్లమీదుగా గంతలు కట్టుకుని విందుకు వెళ్లాడు. విందులో నృత్యాలు చేసేవారు కళ్ళమీద అలాటి గంతలు కట్టుకోవటం ఆచారం.

అక్కడ నృత్యం జరుగుతూండగా రోమియో మొట్టమొదటిసారి జూలియెట్‌ను చూసి, ఆమె అందానికి ముగ్ధుడైపోయి, ఆమెను ప్రేమించ నారంభించాడు. నృత్యం అయిపోగానే అతను జూలియెట్ ఉన్న చోటికి వెళ్లి, స్వతంత్రంగా ఆమె చెయ్యి పట్టుకుని ఆమెకు తన ప్రేమ తెలియజేశాడు, కాని తానెవరో చెప్పలేదు.

అయితే రోమియో రహస్యం దాగలేదు. జూలియెట్ బంధువర్గానికి చెందిన టైబాల్ట్ అనేవాడు, గొంతునుబట్టి రోమియోను గుర్తించి, అతనిపై కత్తిదూశాడు. కాని జూలియెట్ తండ్రి అతన్ని వారిస్తూ, "ఇంత మంది ఉత్సాహంలో ఉన్న సమయంలో రక్తపాతం చేసి రసాభాస చెయ్యకు!" అని మందలించాడు. దుడుకువాడైన టైబాల్ట్, "ఈసారి రోమియో నాకు చిక్కనీ, వాడి ప్రాణాలు తీస్తాను," అని శపథం చేశాడు.

అర్ధరాత్రికి విందు ముగిసి, అతిథులు వెళ్లిపోసాగారు. రోమియోకూడా బయటికి వచ్చాడు, కాని అతని పంచప్రాణాలూ



జూలియెట్ వెంటనే ఉన్నాయి. ఆమెకు దూరంగా వెళ్లిపోవటం అతనికి అసంభవంగా తోచింది. అతను జూలియెట్ ఇంటి వెనుకభాగంలో ఉండే ప్రహరీగోడ దూకి అక్కడ ఉండే తోట ప్రవేశించాడు.

మరి కొంచెంసేపటికి జూలియెట్ ఒక కిటికీ వద్దకు వచ్చి నిలబడింది. రోమియో తననుగురించి ఆలోచిస్తున్నట్టే ఆమెకూడా అతనినిగురించే ఆలోచిస్తున్నది. "రోమియో! మాకు శత్రువువు అయిపోయావెందుకు? నాకోసమైనా నీవు మరొక మనిషివైపోరాదా?" అని ఆమె పైకే మాట్లాడుకోవటం రోమియో విని పొంగిపోయాడు.

అతను ఆమెను సమీపించి, ఆమెను పలకరించాడు. జూలియెట్ ఎంతో కంగారు పడుతూ, "నిన్నుచూస్తే మావాళ్లు చంపేస్తారు!" అన్నది.

"చంపనీ! వారి కత్తులకంటె నీ కళ్లు నాకు ఎక్కువ హాని చేశాయి," అన్నాడు రోమియో.

ఒకరి ప్రేమ ఒకరికి ఎలాగూ తెలిసిపోయింది గనక జూలియెట్ తన ప్రేమను దాచటానికి ప్రయత్నించలేదు. "రేపు నౌకరుద్వారా కబురుచేసి మనపెళ్లి ఎప్పుడు ఎక్కడ జరిగేదీ తెలిపినట్టయితే నేను నీ దాన్ని అవుతాను!" అన్నదామె.






తెల్లవారుతూనే రోమియో ఒక మత గురువువద్దకు వెళ్ళాడు. ఆయన పేరు లారెన్స్. ఆయనకు రోమియో అంటే చాలా వాత్సల్యం. రోమియో కుటుంబానికీ, జూలియెట్ కుటుంబానికీ తరాలవెంబడి నడిచే స్పర్థలను ఆయన ఎన్నడూ ఆమోదించ లేదు. ఆయన ఉభయపక్షాల క్షేమాన్నీ, స్నేహాన్నీ కోరినవాడు.

రోమియో వచ్చి తాను జూలియెట్‌ను ప్రేమించాననీ, రహస్యంగా పెళ్లాడబోతున్నాననీ చెప్పగానే, ఈవిధంగానైనా రెండు కుటుంబాలమధ్యా పొత్తు కుదురుతుందని ఆశపడి, లారెన్స్ వారిద్దరికీ పెళ్లిచెయ్యటానికి అంగీకరించాడు. రోమియా ఈ సంగతి జూలియెట్‌కు కబురు పంపాడు. ఆమె లారెన్స్ వుండేచోటికి వచ్చింది. లారెన్స్ రోమియో జూలియెట్‌లకు శాస్త్రోక్తంగా వివాహం జరిపి వారిని భార్యా భర్తలు చేసేశాడు. జూలియెట్ తన తండ్రి ఇంటికి తిరిగి వెళ్లి, ఎప్పుడు రాత్రి అవుతుందా, ఎప్పుడు రోమియో వచ్చి తనను తోటలో కలుసుకుంటాడా అని ఆత్రంగా ఎదురుచూస్తున్నది.

రోమియో జూలియెట్‌ల పెళ్లిజరిగినరోజు మధ్యాహ్నమే ఒక దుర్ఘటన జరిగింది. రోమియో మిత్రులిద్దరూ వీధిలో పోతూండగా జూలియెట్ బంధువైన టైబాల్ట్ వారికి ఎదురై, మెర్క్యూషియో అనేవాడితో, "రోమియో స్నేహం చేస్తున్నావు. నీకు సిగ్గు లేదా!" అని నిందించాడు. మెర్క్యూషియో మాటకు మాట అన్నాడు. వారి వాగ్వాదం యుద్ధంగా మారబోతున్న దశలో రోమియో అటుగా వచ్చాడు.

వెంటనే టైబాల్ట్ రోమియోను నానా మాటలూ అన్నాడు. ఆ రోజే జూలియెట్‌ను పెళ్లాడివున్న రోమియోకు తన భార్యతరఫు బంధువుతో పోట్లాట పెట్టుకోవటం ఇష్టం లేక, అతను టైబాల్ట్‌తో మంచిగా మాట్లాడ యత్నించాడు. కాని రోమియో పెళ్ళిగొడవ

ఏమీ తెలియని మెర్క్యూషియో ఆగ్రహావేశంతో కత్తిదూసి టైబాల్ట్ పైకి వెళ్ళాడు. వారిని విడదీయాలని రోమియో, బెన్వోలియోలు చేసిన ప్రయత్నం ఫలించలేదు. మెర్క్యూషియో కత్తియుద్ధంలో దెబ్బతిని చనిపోయాడు.

తన మిత్రుడి మరణంతో రోమియో ఒళ్ళంతా మటుమాయమయింది. అతను కత్తిదూసి టైబాల్ట్ పై కలియబడి చివరకు అతన్ని చంపేశాడు. ఈలోపుగా ఈ గలాటా గురించిన వార్త నగరమంతా పాకింది. అక్కడికి వెరోనాప్రభువూ, రోమియో జూలియెట్ల తండ్రులూ, వారి భార్యలూ, అనేక మంది సాధారణ పౌరులూ వచ్చి పెద్ద గుంపుగా గుమికూడారు.

జూలియెట్ తరఫువారు రోమియోను కఠినంగా శిక్షించమని ప్రభువును వేడుకున్నారు. మెర్క్యూషియోను చంపినందుకు టైబాల్ట్‌కు ఎలాగో మరణదండన పడవలిసినదే గనక, అతన్ని చంపినందుకు రోమియోను శిక్షించనవసరం లేదని రోమియో పక్షంవారన్నారు.

ప్రభువు ఎవరి సలహాకూడా పాటించక, మర్నాడు తెల్లవారేలోపుగా వెరోనా నగరం విడిచి వెళ్ళమని రోమియోకు ఉత్తరువిచ్చాడు. వెళ్ళని పక్షంలో అతనికి మరణశిక్ష పడుతుంది.




ప్రభువు ఈ ఉత్తరువిచ్చినప్పుడు రోమియో లారెన్స్‌వద్ద ఉన్నాడు. ఈ ఉత్తరువు మాట వినగానే అతను, "నాకు జూలియెట్ లేని చోటు నరకంతో సమానం. వెరోనానగరం విడిచి ఎలా వెళ్లను?" అని వాపోయాడు.

లారెన్స్ అతన్ని మందలిస్తూ, "నీ అదృష్టానికి సంతోషించు. యుద్ధంలో టైబాల్ట్ నిన్ను చంపలేదు. అతన్ని చంపినందుకు ప్రభువు నీకు మరణదండన విధించలేదు. నీ అదృష్టం బాగున్నది!" అన్నాడు.

"నేను ఈ రాత్రి జూలియెట్‌తో గడిపి తెల్లవారేలోపుగా మాంటువా నగరానికి వెళ్లి పోతాను. అవకాశం చూసి మీరు మా పెళ్లి మాట బయటపెట్టండి. ఆ సంగతి తెలిసి మా కుటుంబాలు తమ ద్వేషాన్ని విడిచి పెట్టి స్నేహంచేయవచ్చు. అప్పుడు ప్రభువు గారుకూడా నా కిచ్చిన శిక్షను ఉపసంహ రిస్తారు. నేను తిరిగి వెరోనా నగరానికి వచ్చి జూలియెట్‌తో హాయిగా కాపరంచేస్తాను," అన్నాడు రోమియో.

రోమియో వెరోనానగరాన్ని విడిచిపోయిన కొద్ది రోజులకే జూలియెట్ తండ్రి ఒక మంచి సంబంధం తెచ్చాడు. వరుడు చాలా గొప్పవంశానికి చెందినవాడు, యువకుడు, అన్నివిధాలా జూలియెట్‌కు తగినవాడు. జూలియెట్‌కు అదివరకే పెళ్లి అయిపోయిం దని తండ్రి ఎరగడు.

తండ్రి సంబంధంగురించి చెప్పగానే జూలియెట్ కంగారుపడి, తన కింకా పెళ్లి యీడు రాలేదన్నది. తమ బంధువైన టెబాల్ట్ చనిపోయి ఎన్నోరోజులుకాకుండానే పెళ్లి జరపటం ఉచితంగా ఉండదన్నది, నోటికి వచ్చిన అభ్యంతరాలన్నీ చెప్పింది. ఆమె అభ్యంతరాలు విని మండిపోయి ఆమె తండ్రి, "వచ్చే గురువారమే పెళ్లి. అందుకు సిద్ధంగాఉండు!" అని నిష్కర్షగా చెప్పాడు.



ఏమిచెయ్యటానికీ తోచక జూలియెట్, లారెన్స్‌వద్దకు వెళ్లి సలహా అడిగింది. "ఒక చిన్న అఘాయిత్యమైన పనిచేస్తే నీకీ పెళ్లి బెడద తప్పుతుంది. అలాటిపని చేసే సాహసం నీకు ఉన్నదా ?" అని లారెన్స్ అడిగాడు.

"నా భర్తకోసం సమాధి కమ్మన్నా అవుతాను!" అన్నది జూలియెట్.

"అయితే నువు ఇంటికి వెళ్లి, పెళ్లికి సమ్మతించి, ఉత్సాహంగా ఉండు. పెళ్లికి ముందురాత్రి నేనిచ్చే మందు తాగెయ్యి. దాని ప్రభావంవల్ల నువు చచ్చిపోయినదానిలాగా అయిపోయి, తిరిగి నలభైరెండు గంటల అనంతరం నిద్రనుంచి లేచినట్టు లేచి కూచుంటావు!" అన్నాడు లారెన్స్.

జూలియెట్ గుండె రాయి చేసుకుని లారెన్స్ చెప్పినప్రకారమే చేసింది. అమె తాను తెచ్చిన వరుణ్ణి పెళ్లాడటానికి ఒప్పుకోవటం చూసి తండ్రి సంతోషించాడు. బుధవారం రాత్రి అమె లారెన్స్ ఇచ్చిన మందు తాగేసింది.

పెళ్లిరోజు ఉదయం జూలియెట్‌నుచూసి అమె బంధువులు చనిపోయిందనే అనుకున్నారు. పెళ్లి సంబరమంతా ఆర్తనాదాలుగా మారింది. పెళ్లి చేయవచ్చిన పురోహితుడు జూలియెట్‌కు అంత్యక్రియలు



జరిపాడు. జూలియెట్ శరీరాన్ని శ్మశానానికి తీసుకుపోయి, వారి కుటుంబానికి చెందిన వారి శవాలనుంచే సమాధిగృహంలో పెట్టి తలుపులు మూశారు.

జూలియెట్ తానిచ్చిన మందు తాగిందని తెలియగానే లారెన్స్, రోమియోకు జరిగిన వాస్తవం తెలియబరచటానికి అతనివద్దకు ఒక మనిషిని పంపాడు. కాని దురదృష్ట వశాత్తూ ఆ మనిషి వచ్చి చేరే లోపలనే జూలియెట్ మరణవార్త రోమియోకు తెలియవచ్చింది.

అతను వెంటనే ఒక పేద వైద్యుడికి డబ్బు బాగా ఇచ్చి కొంత విషం కొని వాయు వేగంతో వెరోనాకు వచ్చి, నేరుగా సమాధిని సమీపించాడు. ఆ సమయంలో అక్కడికి కొత్త పెళ్లికొడుకుకూడా వచ్చాడు. ఇద్దరికీ ఘర్షణ జరిగింది. వారిద్దరూ కత్తులు దూసి పోరాడటంలో కొత్త పెళ్లికొడుకు కాస్తా మరణించాడు. ఇదంతా దూరంనుంచి గమనించిన నౌకరొకడు జూలియెట్ తండ్రి ఇంటికి వెళ్లి తాను చూసిన సంగతి చెప్పాడు.

ఈలోపల రోమియో సమాధిలోకి ప్రవేశించి తన భార్యను చూసి ఆమె నిజంగా చనిపోయిందనే అనుకున్నాడు. ఆమె కొద్ది క్షణాలలో లేవబోతున్నదని తెలియక తాను తెచ్చుకున్న విషం మింగి ఆమె పక్కనే చచ్చి పడిపోయాడు.

కాస్సేపటికి జూలియెట్ లేచింది. తన భర్త శవాన్ని చూసింది. ఒక బాకుతో ఆమె ఆత్మహత్య చేసుకుని తన భర్తను చేరుకున్నది.

అందరూ పరిగెత్తుకుంటూ వచ్చేసరికి అంతా అయిపోయింది. తమ అనర్థపు విద్వేషాలవల్లనే రత్నాలవంటి రోమియో జూలియెట్‌లు అకాల మరణం పాలయారని గ్రహించి ముసలివాళ్లు బుద్ధి తెచ్చుకున్నారు. ఎంతో నరబలి అయాక ఆ కుటుంబాలమధ్య సఖ్యత ఏర్పడింది.





# భీకరమైన తల

పూర్వం గ్రీసుదేశంలో ఒక రాజుండేవాడు. ఆయనకు ఒక కుమార్తెమాత్రమే ఉండేది. తన అనంతరం రాజ్యమేలటానికి కొడుకు కలుగుతాడా, కలగడా అని ఆయన జ్యోతిష్కులను అడగగా, వారు ఆయనకు కొడుకులు కలగరనీ, ఇప్పుడున్న కుమార్తె గర్భాన జనించే మనవడు ఆయన చావుకు కారణమౌతాడనీ జోస్యం చెప్పారు.

ఇది విని రాజు భయపడి, వాకిళ్ళూ, కిటికీలూ లేని ఒక రాతిబురుజు ఎత్తుగా కట్టించి, దానిని ఎవరూ ఎక్కకుండా వుండగలందులకు కంచుతొడుగు ఏర్పాటుచేయించాడు. రాజకుమార్తెను అందులో పుంచి, ఒక చిన్న కంతకుండా ఆమెకు రోజూ ఆహారం అందించేవారు. బురుజుచుట్టూ అహోరాత్రాలు పహరా వుండేది.

రాజకుమార్తెకు మనుష్యప్రపంచంతో ఎలాటి సంబంధమూలేదు. కాని ఆమెకు బురుజు పైనుంచి ఆకాశమూ, పక్షులూ, ఎండా, వెన్నెలా కనిపించేవి.

కొంతకాలం జరిగింది. రాజకుమార్తెకు యుక్తవయసు వచ్చింది. శీతాకాలంలో ఒక నాడు ఆమె కొక వింతకల వచ్చింది. ఆమె బురుజులోనుంచి పైకి చూడగా ఒక బంగారురంగు గల మేఘం కనిపించింది. అందులోనుంచి బంగారు వర్షం వచ్చి ఆమె పైన పడింది. తరవాత తొమ్మిది మాసాలకు ఆమె కొక మగపిల్లవాడు జన్మించాడు.

బురుజు చుట్టూ పహరా ఉండేవాళ్లకు బురుజులోపలినుంచి చంటిబిడ్డ ఏడుపు వినిపించింది. వారు వెళ్లి ఈ సంగతి రాజుతో చెప్పారు. రాజు ఈ వార్త విని వణికిపోయాడు. ఆయన తన కుమార్తెనూ, మనవణ్ణీ బురుజులోనుంచి బయటికి తీయించాడు. వారిద్దరినీ నిండు ప్రాణాలతో చంపెయ్యటానికి సాహసం లేక, ఆయన ఒక

పురాతన గ్రీకు కథ





కొయ్యపెట్టె చేయించి, వారిద్దరినీ అందులో పెట్టి మూత మూసి, ఆ మూతకు రంధ్రాలు చేయించి సముద్రంపై వదిలిపెట్టించాడు. ఈవిధంగా వారిద్దరూ చనిపోతారనీ, తనకు హత్యాదోషం అంటదనీ ఆయన ఆశపడ్డాడు.

కాని అయన అనుకున్నట్టు జరగలేదు. ఆ పెట్టె ఒక పగలూ, ఒక రాత్రీ సముద్రం మీద కొట్టుకుపోయి ఒక తీరాన్ని చేరింది.

అది ఒక లంక. ఆ లంకకు రాజుగా ఉంటున్న వాడి తమ్ముడు ఒక జాలరి. తల్లీ బిడ్డలున్న పెట్టె ఆ జాలరికి దొరికింది. అతను రాజకుమార్తె కథ విని జాలిపడి ఆమెనూ, బిడ్డనూ తన ఇంటికి తీసుకుపోయాడు. బిడ్డకు పెర్సియస్ అని పేరు పెట్టుకున్నారు.

రాజకుమార్తె కష్టాలింకా గట్టెక్కలేదు. ఆమెనుగురించి విని ఆ లంకకు రాజుగా ఉండేవాడు ఆమెను పెళ్లాడుదామని ప్రయత్నించాడు. అతను పరమ క్రూరుడని తెలిసి రాజకుమార్తె అతనిని నిరాకరించింది.

పెర్సియస్ పెరిగి పెద్దవాడయాడు. ఒకనాడు రాజు తన రాజ్యంలో ఉన్న యువకులందరినీ ఆహ్వానించి విందు చేశాడు. ఆ విందుకు వెళ్లినవారంతా రాజుగారికి గుర్రాలో, బంగారమో, మంచి మంచి కవచాలో, బాణాలో తీసుకువచ్చారు. బీదవాడు కావటంచేత పెర్సియస్ ఒకడే ఏమీ తీసుకుపోలేదు.

రాజు అతనితో, "వట్టి చేతులతో వచ్చావేం? ఒక గుర్రాన్నయినా తీసుకురాకపోయావా?" అన్నాడు. అందరూ నవ్వారు.

"గుర్రమా? అంతకంటె 'భీకరమైన తల' తెమ్మని అడగకపోయారా? తెచ్చిపెట్టేవాణ్ణి!" అన్నాడు పెర్సియస్.

"మించిపోయిందేమిటి? ఇప్పుడు అడుగుతున్నాను, భీకరమైన తల తెచ్చిపెట్టు! అదిలేకుండా నా దగ్గిరికి రాకు!" అన్నాడు రాజు. మళ్లీ అందరూనవ్వారు.





పెర్సియస్‌కు తీరని అవమానమయింది. కాని, అతను పైకి బింకంగా, "ఓ, అలాగే తెచ్చి ఇస్తాను!" అని అక్కడినుంచి బయలుదేరి సముద్రతీరానికి వెళ్లి, ఒకచోట ఒంటరిగా కూచుని, తన దీనస్థితికి దుఃఖిస్తూ అలాగే నిద్రపోయాడు.

ఆ నిద్రలో అతనితో ఎవరో ఇలా చెప్పి నట్టు వినపడింది: "నీవు నిజంగా భీకర మైన తలను తీసుకురాదలిస్తే నేను చెప్పేది శ్రద్ధగా విను. నీవు పశ్చిమ దేవతలవద్దకు వెళ్లినట్టయితే వారు నీకు భీకరమైన తల దొరికే మార్గాలు చెబుతారు. పశ్చిమ దేవతల వద్దకు వెళ్లటానికి మార్గం చెప్పగలవారు ముగ్గురు ముసలమ్మలు. వారు ఉత్తరాన ఉంటారు."

ఈ మాటలు వింటూనే పెర్సియస్ నిద్ర లేచాడు. సమీపంలో ఎవరూ లేరుగాని కలలో వినిపించిన మాటలు అతనికి జ్ఞాపకం ఉన్నాయి. ఆ సలహాప్రకారం ప్రయత్నిస్తే భీకరమైన తల తనకు దొరకవచ్చునన్న ఆశ అతనిలో మొలకెత్తింది.

అసలీ భీకరమైన తల అనేది ఏమిటి? ఎక్కడో ముగ్గురు అప్పచెల్లెళ్లున్నారు. వారు భీకరమైన రాక్షసులు. వారి తలలపై వెంట్రుకలకు బదులు పాములుండేవి.



వారికి వాడిఅయిన కోరలూ, కంచుచేతులూ, వాటికి భయంకరమైన గోళ్లూ ఉండేవి. వారు ముగ్గురిలోనూ ఒకతె తల భీకరమైన తలగా ప్రసిద్ధికెక్కింది. దీనికి కారణమే మంటే ఆ తలను చూసిన మనిషి అలాగే శిల అయిపోయేవాడు.

ఈ భీకరమైన తలనుగురించి మనుషు లందరూ ఎరుగుదురు.

పెర్సియస్ ఆ తలను తీసుకురావటానికి నిశ్చయించుకుని, ఇంటికి వెళ్లి తన తల్లితో ఈ సంగతి చెప్పక దేశాటనకు బయలుదేరి పోతున్నాననిమాత్రం చెప్పి ఆమెవద్ద సెలవు తీసుకున్నాడు.





అతను ఉత్తరంగా బయలుదేరి వెళ్లి ముగ్గురు ముసలమ్మలుండే చోటికి చేరాడు. ఈ ముసలమ్మలుకూడా చాలా చెడ్డవాళ్లు; గుడ్డివాళ్లుకూడా. వీరు ముగ్గురికీ కలిపి ఒకే కన్ను ఉండేది; దానిని ఎవరు పెట్టుకుంటే వారుమాత్రమే చూడగలిగేవారు. ఈ ముసలమ్మలు తమ కంటిని ఒకరి చేతినుంచి ఒకరు అందుకునే సమయంలో పెర్సియస్ కాజేశాడు. "మన కన్ను ఎవరో కాజేశారు! మనం ఇక చూడలేం!" అంటూ ముసలమ్మలు వాపోయారు.

"మీ కన్ను నాదగ్గిరే ఉంది. పశ్చిమ దేవతలుండే చోటికి దారి చెప్పారా దీనిని మీకిస్తాను. లేదా, మీ గతి ఇంతే–శాశ్వతంగా గుడ్డివాళ్లయిపోతారు!" అన్నాడు పెర్సియస్.

విధి లేక ముసలమ్మలు పెర్సియస్‌కు పశ్చిమదేవతలుండే చోటికి దారి చెప్పారు. పెర్సియస్ వారి కన్ను వారికిచ్చి ఆ దారిన బయలుదేరి పశ్చిమదేవతలుండే చోటు చేరుకున్నాడు.

పశ్చిమదేవతలు అతన్ని ఆదరించి అతనికి భీకరమైన తల తెచ్చే ఉపాయం చెప్పి, అందుకు అవసరమైన సాధనాలు కూడా ఇచ్చారు. వీటిలో మంత్రపు చెప్పులూ, మంత్రపు కత్తీ, మంత్రపు టోపీ, మంత్రపు సంచీ ఉన్నాయి.



"ఈ చెప్పులు తొడుక్కుంటే నీవు మనో వేగంతో కోరిన చోటికి వెళ్లగలవు. ఈ మంత్రపు కత్తి ఒక్క వేటున దేన్నయినా తెగవేస్తుంది. మంత్రపు టోపీ నిన్ను అదృశ్యంగా ఉంచుతుంది. భీకరమైన తలను నరికినాక మంత్రపు సంచీలో వేసుకో. ఆ తల గల రాకసిని నేరుగా చూస్తే నీవు శిల వైపోతావు. కనక అద్దంలాగా మెరిసే డాలును పట్టుకుని అందులో చూస్తూ రాకసి తల తెగవెయ్యాలి. నీ పని అయిపోయాక మా సాధనాలను సంచీలో ఉంచి కొండమీద పెట్టావంటే అవి మళ్లీ మాకు చేరుతాయి!" అన్నారు పశ్చిమదేవతలు.

పెర్సియస్ వారివద్ద సెలవు పుచ్చుకుని మంత్రపు చెప్పుల మహిమవల్ల రాకసు లుండే మంచుకొండలకేసి మనోవేగంతో బయలుదేరాడు. అతను మంత్రపు టోపీని ధరించి అదృశ్యంగా ఉండి తన డాలులో కనిపించే ప్రతిబింబాన్ని మాత్రమే చూస్తూ కత్తి చేతబట్టి సిద్ధంగా ఉన్నాడు.

కొంతసేపటికి అతను ముగ్గురు రాకసులున్న చోటికి వచ్చాడు. ఆ సమయానికి వారు ముగ్గురూ నిద్రపోతున్నారు. భీకరమైన తల గల రాకసి మధ్యలో పడుకున్నది. పెర్సియస్ డాలులో చూసుకుంటూ దాన్ని సమీపించి ఒక్క వేటుతో దాని తల





నరికి వెంటతెచ్చిన మంత్రపు సంచీలో వేసుకుని బయలుదేరాడు.

ఆ అలికిడికి మిగిలిన ఇద్దరు రాకసులూ లేచి అతని వెంటపడ్డారు. వారికి అందకుండా పెర్సియస్‌ను కాపాడినవి మంత్రపు చెప్పులు కావు; వాటిపాటి వేగం ఈ రాకసులకూ ఉన్నది. కాని అతని నెత్తిన మంత్రపు టోపీ ఉండటంతో ఆ రాకసులు అతన్ని చూడలేకపోయారు.

ఎలా అయితేనేం భీకరమైన తలను సాధించి మంత్రపు చెప్పుల సహాయంతో అతి వేగంగా ఆకాశమార్గాన వస్తుండగా, పెర్సియస్‌కు మధ్యదారిలో ఒక వింత కన



బడింది. అతనికి దిగువగా ఒక తీరం ఉన్నది. దాని వెంబడి ఎత్తయిన కొండలున్నాయి. సముద్రంలోకి చొచ్చుకువచ్చిన ఒక గుట్టపైన ఒక తెల్లని స్త్రీ ఆకారం కనిపించింది. అది విగ్రహ మనుకుని చూడటానికి పెర్సియస్ దిగివచ్చి, అక్కడ నిలబడినది ఒక యువతి అని తెలుసుకున్నాడు. అతను ఆశ్చర్యంతో, "ఇక్కడ ఇలా ఎందుకు నిలబడ్డావు? నిన్నా గొలుసులతో బంధించా రెందుకు?" అని ఆమెను అడిగాడు.

"నేను ఈదేశపు రాజుకూతురును. మా అమ్మకు తాను చాలా గొప్ప అందగత్తెనని గర్వం. ఒకసారి ఆవిడ తాను సముద్ర దేవతా స్త్రీలకంటె చక్కనిదాన్నని ప్రగల్భాలాడింది. అది విని సముద్రదేవతలు మా దేశంపైకి సముద్ర రాకసిని పంపించారు. ఆ రాకసి రోజుకొక మనిషిని ఎత్తుకుపోయి తింటుంది!" అని ఆ రాజకుమార్తె చెప్పింది.

"భయపడకు, నీప్రాణం కాపాడతాను!" అంటూ పెర్సియస్ సముద్రరాకసిని చంపటానికి సిద్ధపడ్డాడు. త్వరలోనే సముద్రం మీదినుంచి రాకసి వచ్చింది. పెర్సియస్ మంత్రపు టోపీ ధరించి అదృశ్యంగా ఉండి రాకసిని తన కత్తితో ఎన్నో దెబ్బలు కొట్టాడు.





గాయపడికూడా రాకసి రాజకన్యకేసి వస్తూం డటం కనిపెట్టి అతను సంచీలోనుంచి భీకర మైన తల ఎత్తి రాకసికేసి పట్టుకుని తాను ముఖం తిప్పుకున్నాడు. మరుక్షణం అది శిల అయిపోయింది.

తరవాత పెర్సియస్ తలను సంచీలో పెట్టేసి రాజకుమార్తెను కట్టిన గొలుసులు ఖండించి, "మీ తల్లి దండ్రులవద్దకు పోదాం పద!" అన్నాడు.

"వద్దు! నన్ను మీవెంట తీసుకుపొండి. మీ దాసిగా అయినా బతికి మీ రుణం తీర్చుకుంటాను," అన్నది రాజకుమార్తె.

"అయితే మా గ్రీసుదేశం వచ్చి నన్ను పెళ్లాడు!" అన్నాడు పెర్సియస్. ఆమె సమ్మతించింది.

కాని తన కుమార్తె ఒక అనామకుణ్ణి పెళ్లాడటానికి ఆమె తండ్రి సమ్మతించలేదు. ఆయన తన బావమరిదిని ప్రేరేపించి, "ఈ సంబంధం ఎలాగైనా పడగొట్టి నా కూతురిని నువే చేసుకో!" అన్నాడు.

రాజుగారి బావమరిది సైన్యంతోసహా వచ్చి పెర్సియస్‌తో, "నువు మాపిల్లను పెళ్లాడటానికి అర్హుడివికావు. ఆమెను విడిచి పుచ్చుతావా? లేక నాతో యుద్ధానికి వస్తావా?" అన్నాడు.




"సముద్ర రాకసిని చంపినవాణ్ణని జ్ఞాపకం ఉంచుకోండి. నన్ను మీరేమీ చేయ లేరు!" అన్నాడు పెర్సియస్.

కాని రాజుగారి బావమరిది మంచి మాటలకు లొంగలేదు. పెర్సియస్ భీకర మైన తల చూపించి తన శత్రువులనందరినీ రాళ్లుగా మార్చేశాడు.

తరవాత అతను తన భార్యతో బయలు దేరి తల్లిఉండే చోటికి వచ్చాడు.

అతను తిరిగి వచ్చేలోపుగా ఇక్కడ చాలా మార్పులు జరిగాయి. రాజు తన తమ్ముడైన పల్లెకారిని ఖైదుచేసి, పెర్సియస్ తల్లిని తన ఇంట దాసిగా ఉంచాడు. పెర్సి

యస్ ఆ రాజువద్దకు వెళ్లి, "మా అమ్మను వెంటనే విడిచిపెట్టి, ఆవిడకు నీవు చేసిన అన్యాయానికిగాను పరిహారంకింద కొంత బంగారం ఇచ్చుకో !" అన్నాడు.

"ఓరి, నువా? మళ్లీ వచ్చావా ? ఎవరురా అక్కడ? ఈ దుర్మార్గుణ్ణి కట్టి కారా గృహంలో పడెయ్యండి !" అన్నాడు రాజు.

"రాజుగారూ, ఒక్కక్షణం ఆగండి. నన్ను ఒక వస్తువు తెమ్మని పంపారు. అది తెచ్చాను. చూసి ఆనందించరా ?" అని పెర్సియస్ అడిగాడు.

"అవునవును! భీకరమైన తల తెస్తానని వెళ్లావు? ఏదీ తల ?" అన్నాడు రాజు.

పెర్సియస్ సంచీనుంచి తల తీసి రాజు కళ్లఎదట పెడుతూ తన ముఖం తిప్పేసుకున్నాడు. వెంటనే రాజు కాస్తా రాయి అయిపోయాడు.

తరవాత పెర్సియస్ తన పెంపుడు తండ్రిని ఖైదు విడిపించి, ఆయనను ఆ దేశానికి రాజు చేశాడు.

ఇప్పుడు పెర్సియస్ తల్లిద్వారా తన తాతగారి సంగతంతా తెలుసుకున్నాడు. అతను భార్యాసమేతుడై తాతగారిని చూసి రావటానికిగాను తల్లి పుట్టిన దేశం వెళ్ళాడు. కాని ఈ సంగతి ముందుగానే తెలిసి అతని తాత మరొక దేశానికి పారిపోయాడు.



పెర్సియస్ అక్కడికి వెళ్లి తన తాతతో, "తాతయ్యా, నన్ను చూసి ఎందుకు భయపడతావు? నీవు నాకూ మా అమ్మకూ ద్రోహం చేసినా నాకు నీపైన విరోధభావం లేదు. ఇంటికి పోదాం పద!" అన్నాడు.

అతను తాతగారితో స్వదేశానికి బయలు దేరే ముందుగా ఆటల పోటీలు జరిగాయి. ఈ పోటీలో పెర్సియస్ చక్రం విసురుతూం డగా అది చేతినుంచి జారి గురితప్పి అతని తాతకే తగిలింది. ఆ దెబ్బకు ఆయన చని పోయాడు. జోస్యం ఫలించనే ఫలించింది.

ఈ సంఘటనకు పెర్సియస్ చాలా నొచ్చుకున్నాడు. తాతగారి రాజ్యం ఇప్పుడు తనదే అయినప్పటికీ దానిని మరొకరి కిచ్చి దానికి బదులుగా సమీపంలో వున్న మరొక రాజ్యాన్ని తీసుకున్నాడు. ఇక్కడ పెర్సి యస్ తన భార్యతో కొంతకాలం సుఖంగా జీవించాడు.

కొద్ది సంవత్సరాలు గడిచాయి. ఈ లో పుగా అతను భీకరమైన తలను ఒక రహస్య స్థలంలో పాతిపెట్టి పశ్చిమదేవత లిచ్చిన చెప్పులూ, కత్తికూడా వారి సంచీలో ఉంచి ఒక కొండ శిఖరాన పెట్టి వారికి చేర్చాడు.

ఒకనాడు పెర్సియస్ రాజ్యంపైకి సము ద్రంమీదుగా అనేక నౌకలు రావటం కని పించింది. తన మామగారు తన భార్యను





తీసుకుపోవటానికీ, అవసరమైతే తనతో యుద్ధం చెయ్యటానికీ వస్తున్నాడని తెలిసింది. ఒకదూత వచ్చి ఈసంగతి చెప్పాడు. పెర్సియస్ యెన్ని చెప్పినా దూత వినిపించుకోలేదు.

"కనీసం ఒక్కసారి మామగారిని వచ్చి నన్నూ తన కుమార్తెనూ చూసి మాట్లాడమని చెప్పు. మేము ఆయనను బంధించమనీ, ఆయనపైన ఆయుధం ప్రయోగించమనీ ప్రమాణం చేస్తున్నాను!" అని పెర్సియస్ దూతతో చెప్పాడు.

అ రాత్రి అతను భీకరమైన తలను రహస్యస్థలంనుంచి తవ్వి తీసి సముద్ర తీరాన ఒక రాతిగట్టు పక్కగా నీటిలో ముంచి ఉంచి, మర్నాడు ఉదయం తాను వెళ్లి తన మామగారికోసం ఎదురుచూస్తూ అ గట్టుపైననే కూచున్నాడు.

ముసలిరాజును ఒక తెప్పలో అతనున్న చోటికి తెచ్చారు. "నేను నా కూతుర్ని తీసుకుపోవటానికి వచ్చాను. నీవు ఏమి చేసినా నా మనసు మారబోదు!" అన్నాడు పెర్సియస్ మామగారు.

"ఇలా చూడండి. మీ మనసు తప్పక మారుతుంది!" అంటూ పెర్సియస్ నీటినుంచి భీకరమైన తలను ఆయనకు ఎదురుగా ఎత్తి తన ముఖాన్ని పక్కకు తిప్పుకున్నాడు.

ముసలిరాజు అంధుడు. ఆ సంగతి పెర్సియస్‌కు తెలియదు.

ఆయన తన అల్లుడితో, "నా మనసు అలా ఎన్నటికీ మారదు!" అన్నాడు.

ఈ మాటలు వినగానే, భీకరమైన తల యొక్క ప్రభావం ముసలాయనపైన పారలేదని పెర్సియస్‌కు తెలిసిపోయింది. దాని మహత్తు కాస్తా పోయిందా అనుకుంటూ అతను ముఖం తిప్పి ఆ భీకరమైన తలకేసి చూశాడు. మరుక్షణం అతని శరీరం కాస్తా శిల అయిపోయింది.





# దక్షిణధ్రువాన తొలి "నిశాచరులు"—2

సామాన్యంగా కొత్తకాపరం ఏర్పాటు చేసినాక ఎన్నో వందల చిల్లర సామగ్రి కావలిసివస్తుంది. అందులోనూ ఇది దక్షిణ ధ్రువాన కాపరం. గుండుసూది కావాలన్నా ఆరు నెలలు ఆగవలిసిందే. రేడియోద్వారా సంభాషణలైతే చేయవచ్చుగాని మనుషు లుండే లోకంనుంచి ఏమీ తెప్పించుకునే టందుకు లేదు. అయితే ఈ శిబిరంలో ఉండేవారు చాలా నిపుణులు. అవసరానికి గాను అనేక పరికరాలను శిబిరంలో ఉండే వస్తువులతోనే సృష్టించుకుని పని జరుపు కున్నారు. మంచుసొరంగంలో దీపాలు ఏర్పాటుచేయటానికి వైరూ మొదలైనవి చాలలేదు. సామాన్లు విమానంనుంచి దిగి నప్పుడు వాటిని కట్టటానికి ఉపయోగించిన తీగెను వాడుకున్నారు.

దక్షిణధ్రువప్రాంతంలో గల అన్ని శాస్త్ర పరిశోధనా కేంద్రాలలోనూ ఉన్న శాస్త్రవేత్త లందరిలోకీ ఎక్కువ సంఖ్య వాతావరణ పరిశీలకులదే. దక్షిణధ్రువ శిబిరంలో వీరు నలుగురున్నారు. వారు శిబిరానికి నూరు గజాలు ఎడంగా ఆరుబయట అనేక శాస్త్ర పరికరాలను ఉంచి, వాతావరణంగురించి అవి తెలిపే వివరాలను జాబితా వేసేవారు. ఈ పరికరాలు చాలా సున్నితమైనవి. వాటిని మూడు గంటల కొకసారి పోయి పరీక్షించేవారు. ఇందుకుగాను నలుగురిలో ఒకడు తొడుగులు ధరించుకుని టార్చి లైటుతో దారి చూసుకుంటూ చలిలో పడి వెళ్లటం జరుగుతూండేది. వెళ్లినవాడు ఎక్కువసేపు ఉండటానికి లేదు; పరికరా లన్నిటినీ చూసుకోవటమూ, ఉష్ణోగ్రత





తెలుసుకోవటమూ, ఆకాశంనుంచి మంచు పడుతున్నదేమో చూడటమూనూ.

ఇలా ఆరుబయటికి వెళ్లినవాడు చంద్రుడుండే సమయాలలో చంద్రుడి చుట్టూ పాలిపోయిన ఇంద్రధనుసులాటిది చూడగలుగుతాడు. ఈ కాంతివలయం గాలిలో ఉండే అతి సూక్ష్మమైన మంచునలుసుల మూలాన ఏర్పడుతుంది. అయితే ఈ ప్రకృతి శోభను చూస్తూ కూచుంటే వాతావరణ పరిశీలకుడు చలికి బిగుసుకుపోతాడు.

వాతావరణ పరిశీలకులు ఎత్తున ఉండే పవనాలనుకూడా పరిశీలించాలి. ఇందుకుగాను పెద్ద బెలూనులకు రేడియో సంకేతాలు పంపే చిన్నచిన్న యంత్రాలు కట్టి ఎత్తుగా పంపారు. బెలూనులు ఎత్తు వెళ్లాలంటే వాటిని తేలిక అయిన హైడ్రొజెనుతో నింపాలి. హైడ్రొజెన్ ఉత్పత్తి చెయ్యటానికి పెద్ద ఇనప గిండీ ఉండేది. అది అల్యూమినియం ముక్కలనూ, కాస్టిక్ సోడానూ, అంతులేని నీటినీ తాగేస్తూండేది.

గాలిలో పడి వెళ్లిపోయే బెలూనుల జాడ కనిపెట్టటానికిగాను భోజనశాలకు ఎగువగా ఒక గది కట్టి దాన్ని ప్లాస్టిక్ గుమ్మటంతో కప్పారు. ఈ గదిలో రేడియో సంకేతాలను స్వీకరించే యంత్రం ఉన్నది. బెలూన్ వెంట ఉన్న రేడియో యంత్రం ఉష్ణోగ్రతనూ, గాలి ఒత్తిడినీ, గాలిలో ఉండే చెమ్మనూ గురించిన వివరాలను సంకేతాల రూపంలో పంపేది. దాని సంకేతాలు వినిపించకుండాపోయాక ఒక గంటసేపుపాటు ఆ వివరాలను జాబితా వేసుకునేవారు. ఆ తరవాత వాటిని "చిన్న అమెరికా"లో ఉండే వాతావరణాలయానికి రేడియోద్వారా పంపేవారు.

ఈ శిబిరంలో భూకంపాలను గురించి కూడా పరిశోధన జరిగింది. ఈ పరిశోధనలు సాగించినవాడు బాబ్ బెన్సన్ అనేవాడు. ఇందుకు ఆయన బహుసున్నితమైన



యంత్రాన్ని ఉపయోగించాడు. ఇది శిబిరానికి దగ్గిరగా ఉంటే భూకంపాలతోబాటు శిబిరం తాలూకు కంపనాలుకూడా రికార్డవుతాయని దాన్ని తీసుకుపోయి శిబిరానికి 1000 అడుగుల దూరంలో ఉంచాడు. శిబిరంనుంచి అక్కడికి మంచులో ఒక సొరంగం తవ్వారు.

దీర్ఘ రాత్రి పొడుగునా ఆకాశంలో ధ్రువ కాంతులు కనిపిస్తూనే వచ్చాయి. వీటిని "ఆరోరా" అంటారు. వీటిని గమనించారు, ఫొటోగ్రాఫు చేశారు. శాస్త్రపరిశీలన చేశారు. ఈ పనికి నియోగితుడైన ఆర్లో లాండోల్ట్ అనేవాడు ఒక పెట్టెలాటి గోపురంలో కూచుని పనిచేసేవాడు. ధ్రువకాంతులు ఆకాశంలో ఉజ్వలంగా వెలుగుతున్నంత కాలమూ అతను ఆ గోపురంనుంచి దిగి వచ్చేవాడుకాడు. సాధారణంగా అతను రెండు, మూడు గంటలు మాత్రమే నిద్ర పోయేవాడు.

ఆర్లో శిబిరానికి పైన ఉండి పనిచేస్తే, ఎడ్వర్డ్ రెమింగ్టన్ అనే అతను శిబిరం అడుగున పనిచేసేవాడు. ఇతను హిమ శాస్త్రవేత్త. మంచురాళ్లు తవ్వటమూ వాటిని తన గదికి తీసుకుపోయి, రంపంతో సన్నని పలకలుగా కోసి పరీక్షించటమూ



అతని పని. వీటి పరిశీలనలవల్ల ఈ ప్రాంతంలో లోగడ ఉండిన శీతోష్ణస్థితి తెలుస్తుంది. ఇతను ఒక్కొక్క అంగుళం మందం గల మంచుపలకలను ఫొటోగ్రాఫు చేసి, వాటి తాలూకు ముక్కలు కరిగించి నీరు చేసి ఆ నీటిని రసాయనపరిశోధన నిమిత్తం ప్రత్యేకంగా ఉంచేవాడు.

ఇలాగే గాలిలో అత్యున్నతంగా ఉండే విద్యున్మండలాన్నిగురించి కూడా పరిశోధనలు జరిగాయి. ఈ విధంగా "కాళరాత్రి" అనదగిన దక్షిణధ్రువపు దీర్ఘరాత్రి ఆరు మాసాలూ గడిచి మళ్లీ సూర్యోదయం అయే సమయం సమీపించింది.



దక్షిణధ్రువాన ఆరు నెలలు దీర్ఘరాత్రి అయినప్పటికీ కటిక చీకటి నాలుగు మాసాలు మాత్రమే ఉంటుంది. సూర్యాస్తమయ మయాక ఒక నెలా, సూర్యోదయం కాక పూర్వం ఒక నెలా ఆకాశంలో సంధ్యా కాంతి ఉంటుంది—మనకు సూర్యాస్త మయం అయాక ఒక గంటసేపూ, సూర్యో దయానికి ముందు ఒక గంటసేపూ ఉన్నట్టుగానే.

ఇక్కడ రాత్రి అంతా గడిపిన "నిశా చరులకు" జూన్ 22 నడిరాత్రి. బయట చలి మంచుకన్న 80 డిగ్రీలు హెచ్చుగా ఉంటూ వచ్చింది. దీనికి తగ్గట్టుగా విడవని హోరుగాలి, గంటకు 15, 20 మైళ్ల వేగంతో వీస్తూ ఉండింది. అయినప్పటికీ ఈ కేంద్రంలో నివసించినవారు అంత చలి లోనూ, ఈదురు గాలిలోనూ బయటికి వెళుతూవచ్చారు.

వారిలో ఒకడు ఒకసారి బయటికి వెళ్లి 4 గంటలసేపు తిరిగిరాలేదు; కాని అతని కేమీ జబ్బు చెయ్యలేదు.

సెప్టెంబరు 18 న డాక్టరు సిపిల్ మంచు సారంగంకుండా బయటికి వచ్చాడు. సూర్యుడు ఉదయించబోయే సూచనలు కనిపిస్తున్నాయి. సగం ఆకాశం పసుపురంగు పూసినట్టుగా ఉన్నది. డాక్టరు సిపిల్ వెంట జాన్ టక్ అనే సైనికాధికారి కూడా ఉన్నాడు, "బ్రేవో" అనే కుక్క ఉన్నది.

చాలా మాసాలకు తిరిగి పగటి వెలుగు కనిపించిన ఆనందంలో కుక్క గెంతు తున్నది. కాని ఆ రోజు చలి మంచుకంటె 102 డిగ్రీలు ఎక్కువగా ఉన్నది. ప్రపం చంలో ఎక్కడా ఇంత చలి ఉండదు. వారు బయలుదేరినది దక్షిణధ్రువాన పాతిన జెండావద్దకు.

ఈ ధ్రువాన్ని గురించి సరి అయిన లెక్కలు కట్టగా అది శిబిరానికి 2400 అడు గుల దూరాన, ఆస్ట్రేలియా తూర్పుతీరం



ఉండే దిక్కుగా, ఉన్నట్టు తేలింది. ఈసారి వారు దక్షిణధ్రువాన్ని సరిగా నిర్ణయించి అక్కడ జెండా పాతారు. అప్పటికీ తమ లెక్కలలో ఒక వంద అడుగులు వ్యత్యాసం ఉండవచ్చుననుకుని, ఆ జెండాకు నూరు అడుగుల దూరంగా ఒక వలయంలో ఖాళీ నూనెడబ్బాలు ఏర్పాటు చేశారు. ధ్రువం ఆ నూనెడబ్బాల మధ్యను ఎక్కడో ఉండి తీరాలన్న మాట. ఆ నూనెడబ్బాల చుట్టూ తిరిగి రావటానికి రెండు నిమిషాలు పడుతుంది—కాని అది ఒక భూప్రదక్షిణం!



వారు అరుణోదయం దిక్కుగా చూస్తూండగా ఒక అద్భుతమైన దృశ్యం కనిపించింది. ఇప్పుడు ఆ ప్రాంతంలో ఆకాశం చాలా కాంతివంతగా ఉండి, పొగ లేని కార్చిచ్చులాగా ఉన్నది. దానిలో చుట్టూ సన్నని పొడుగాటి మబ్బులున్నాయి. ఈ మబ్బుల మధ్యనుంచి మతాబాలనుంచి వచ్చే కాంతి "ముత్యాల" లాటివి, కళ్లు మిరుమిట్లు గొలుపుతూ, ఎర్రగా, ఆకుపచ్చగా, నీలంగా వెలువడసాగాయి. అవి ఒక సెకండులో అదృశ్యమవుతూ వచ్చాయి.

వారు తమ శిబిరానికి తిరిగివెళ్లి సూర్యోదయం కాబోతున్నదని అందరికీ తెలియజేశారు. అందరూ కామెరాలు పట్టుకుని బయటికి వచ్చారు. కాని ఈ లోపుగా "మతాబాలు" నిలిచిపోయి, మరొక వింత దృశ్యం ప్రారంభమయింది. సూర్యుడు పైకి వచ్చినట్టు కనిపించింది, కాని కళ్లు చికిలించి చూస్తే అది సూర్యబింబంలాగా లేక, ఎర్రని అడ్డచారలలాగా ఉన్నది. ఒక గంట సేపటికల్లా పొగమంచు అడ్డం వచ్చి ఏమీ కనిపించకుండా పోయింది.

కాని వారు చూసినది సూర్యోదయం కాదు—ఒకరకమైన ఎండమావులు. భూమి మీదకంటె 1400 అడుగుల ఎత్తున ఉండే గాలి ఎక్కువ వేడిగా ఉండి, దిక్చక్రానికి దిగువగా ఉన్న సూర్యుణ్ణి రకరకాలుగా



ప్రతిబింబించింది. ఈ ఎండమావులు చాలా రోజులపాటు కనిపించాయి. నిజంగా ఉదయించిన సూర్యుడు దిక్చక్రంమీదుగా తిరగాలి; కాని ఈ మాయసూర్యుడు ఒక పక్క ఉదయించి మరొక పక్కగా అస్తమించుతూ వచ్చింది.

నిజమైన సూర్యోదయం సెప్టెంబరు 23 న జరిగింది. అ సూర్యుడు తిరిగి మార్చి 22 దాకా అస్తమించడు. అప్పటిదాకా దక్షిణధ్రువానికి పగలే—ఉత్తరధ్రువానికి మటుకు రాత్రి.

సూర్యోదయమైనందుకు శిబిరంలో వున్న వారందరూ విందు చేసుకున్నారు.

అందరూ ఉత్సాహంగా ఉండటమే గాక ఆత్రంగాకూడా ఉన్నారు. మళ్లీ విమానాలు వస్తాయి; ఉత్తరాలూ, అవసర వస్తువులూ తెస్తాయి!... కాని మొట్టమొదటి విమానం దక్షిణధ్రువాన్ని చేరటానికి సూర్యోదయమైనాక దాదాపు నెలరోజులు పట్టింది.

అక్టోబరు 17 న వచ్చింది విమానం. గాలిలో శిబిరంచుట్టూ తిరుగుతూ, గాలిగొడుగుల సహాయంతో నూనెడబ్బాలు పడవేసింది. తరవాత ఉత్తరాల కట్టలు దిగాయి. ఎనిమిది మాసాల అనంతరం శిబిరంలో ఉన్నవారు తమవారి లేఖలు చదువుకున్నారు. ఈ కాలంలో రష్యనులు స్పుత్నిక్‌లను ప్రయోగించారు, అడ్మిరల్ బర్డ్ చనిపోయాడు—విషాదవార్త!

రోజులు గడుస్తున్నకొద్దీ విమానాలు వచ్చి సరుకులు పడవెయ్యటం హెచ్చింది. పాత వారి స్థానే పని చెయ్యటానికి కొత్తవారు వచ్చారు. డాక్టర్ పాల్ సిపిల్ 1957 డిసెంబరు 1 న దక్షిణధ్రువానికి వచ్చి చేరాడు. అయన 1958 డిసెంబరు 1 న తిరిగి దక్షిణధ్రువంనుంచి బయలుదేరి అమెరికాకు వెళ్లిపోయాడు. ఆయనా, అయనవెంట ఉండిన శాస్త్రవేత్తలూ జరుపుతూ వచ్చిన పరిశోధనలను కొత్తవారు కొనసాగించారు.






# అహింసాజ్యోతి

## [ 9 ]

అంగ మగధదేశాలలో అయిదుగురు కోటీశ్వరులైన వర్తకులుండేవారు. వారిలో మేదుడు ఒకడు. ఆయనకు చంద్రపద్మ అనే కూతురూ, ధనంజరుడనే కొడుకూ వుండేవారు. ధనంజరుడి భార్యపేరు సుమన. వారికి విశాఖ అని ఏడేళ్ళ వయసుగల చక్కని కూతురుండేది.

ఇలా వుండగా బుద్ధుడు అంగదేశంలోని భద్రి అనే గ్రామానికి వస్తున్నట్టు వార్త వచ్చింది. మేదుడు తన కొడుకు ధనంజరుడితో, "మన విశాఖను బుద్ధుడివద్దకు పంపు, చూసి వస్తుంది," అన్నాడు. విశాఖ బుద్ధుణ్ణి చూడటానికి ఉబలాటపడింది. ఆమెవెంట ఆమె ఈడు ఆడపిల్లలను రథాలలో పంపారు. విశాఖ బుద్ధుణ్ణి సమీపించేటప్పుడు రథం నుంచి దిగి కాలినడకను ఆయన వద్దకు వెళ్ళింది.

బుద్ధుడు ఆ పిల్లను చూడగానే, "ఈమె నా ప్రధాన శిష్యురాలై నా శిష్యులందరికీ తల్లిలాగా వుంటుంది!" అనుకున్నాడు. ఆయన విశాఖకూ, ఆమెవెంట వచ్చిన అయిదువందలమంది బాలికలకూ ధర్మ బోధ చేసి వారిని దారిలో పెట్టాడు. ఆ మర్నాడు విశాఖ తాతగారైన మేదుడుకూడా బుద్ధుడి బోధలు విని మొదటి సోపానం ఎక్కాడు. రెండు వారాలపాటు మేదుడి ఆతిథ్యం స్వీకరించి బుద్ధుడు తన అనుచరులతో జేతవనానికి తిరిగివెళ్ళాడు.



ఏడెనిమిది సంవత్సరాలు గడిచి పోయాయి. రాజగృహాన్ని పరిపాలించే బింబిసారుడూ, కోసలను పరిపాలించే రాజూ ఒకరికొకరు బావమరుదులు; ఒకరి చెల్లెలిని ఒకరు చేసుకున్నారు. రాజగృహంలో ప్రముఖులైన వర్తకులు చాలా మంది ఉన్నారు, కాని కోసలలో లేరు. అందుచేత కోసల రాజు బింబిసారుడి వద్దకు వెళ్ళి, "మీ నగరంలో వుండే వర్తకులలో ఒకరిని కోసలకు పంపించు!" అని కోరాడు. బింబిసారుడు ధనంజరుణ్ణి పిలిపించి, "నీవు కోసలకు వెళ్ళి అక్కడ నివాసం ఏర్పాటు చేసుకుంటావా ఏమిటి?" అన్నాడు.

"తమ ఆజ్ఞ అయితే వెళతాను," అన్నాడు ధనంజరుడు.

అతను కోసలరాజు వెంట తన పరివారమంతా తీసుకుని బయలుదేరాడు. దారిలో సాయంకాలంవేళకు వారు ఒక విశాలమైన ఖాళీ ప్రదేశాన్ని చేరుకున్నారు. అది నాలుగు దారులు కలిసే చోటు. ధనంజరుడు కోసల రాజుతో, "మహారాజా, నావెంట చాలా పెద్ద సిబ్బంది ఉన్నది. వీరందరికీ మీ నగరంలో చోటు చాలకపోవచ్చు. తమ సెలవైతే మేమిక్కడే ఒక నగరం నిర్మించుకుంటాం," అన్నాడు. కోసలరాజు ఇందుకు సమ్మతించాడు. త్వరలోనే ఆ ప్రదేశాన





సాకేతు అనే మహానగరం నిర్మాణ మయింది. దానికి ధనంజయుడు నాయకుడుగా రాజుగారు ప్రకటించాడు.

ఈ సమయంలో శ్రావస్తినగరంలో మిగారుడనే వర్తకుడికి పూర్ణవర్ధనుడనే కుమారుడుండేవాడు. వాడు అందగాడు. "పెళ్లి చేసుకోరా, బాబూ!" అని తల్లి దండ్రులు కోరితే పూర్ణవర్ధనుడు, "నేను పెళ్లాడితే పంచకల్యాణి అనిపించుకునే స్త్రీనే పెళ్లాడతాను," అన్నాడు. పంచకల్యాణి అయిన స్త్రీకి జుట్టు నెమలిపింఛం లాగా ఉండాలి; పెదవులు తాంబూలం వేసుకున్నప్పుడూ వేసుకోనప్పుడూ ఒకే రంగులో ఉండాలి; పలువరస తెల్లగా, ఎగుడుదిగుళ్లూ, హెచ్చుతగ్గులూ లేకుండా ఉండాలి; శరీరమంతటా ఒకే ఛాయ ఉండాలి, ఎక్కడా మచ్చలుండరాదు; ఎంతమంది పిల్లలను కన్నా నవయువ్వని లాగే ఉండాలి, ఎంత వయసు వచ్చినా వెంట్రుకలు నెరియరాదు.

పూర్ణవర్ధనుడి మాట కాదనలేక తల్లి దండ్రులు పంచకల్యాణి అయిన కన్యను వెతకటానికిగాను ఎనిమిదిమంది బ్రాహ్మణులను దేశదేశాలకూ పంపారు. వారు అనేక దేశాలు తిరిగి ఒక పర్వదినంనాడు సాకేతునగరానికి వచ్చారు. పర్వదినం





కావటంచేత నగరంలో ఉండే ఉత్తమ స్త్రీలందరినీ వీధిలో చూసే అవకాశం ఉన్నది. అందుచేత ఆ బ్రాహ్మణులు ఒక చావడిలో నిలబడి వీధివెంట వచ్చేపోయే జనాన్ని గమనించసాగారు.

కొద్దిసేపట్లోనే పదిహేనేళ్ల ప్రాయం గల విశాఖ తన చెలికత్తెలతోసహా అటుగా వచ్చింది. ఇంతలో వానజల్లు పడింది. విశాఖ చెలికత్తెలందరూ పరిగెత్తి చావడి చేరుకున్నారు.

విశాఖ తన చెలికత్తెలతోపాటు పరిగెత్తక, వాన లేనట్టుగానే మామూలు మందగమనంతో చావడికేసి వచ్చింది.



"ఈమె దంతాలు ఎలా ఉంటాయో తెలియటంలేదుగాని, కేశకల్యాణం మొదలైన నాలుగు కల్యాణాలూ ఈ పిల్లలో ఉన్నాయి!" అనుకున్నారు బ్రాహ్మణులు. ఆమె దంతాలు చూడాలంటే ఆమెను పలకరించాలి. అందుకని బ్రాహ్మణులు ఆమెతో, "తల్లీ, నిన్ను ఏ అదృష్టహీనుడు చేసుకుంటాడోగాని, నువు ఉదయం నీళ్ల కోసం వెళితే మళ్లీ చీకటిపడ్డదాకా ఇంటికి రావు. నీ భర్త అంతదాకా పస్తే!" అన్నారు.

"ఈ సంగతి మీరెలా చెబుతున్నారు?" అని విశాఖ బ్రాహ్మణులను ప్రశ్నించింది.

"కళ్లతో చూస్తే తెలియటంలేదా, తల్లీ? వానజల్లు ప్రారంభంకాగానే మిగిలిన ఆడపిల్లలందరూ చావడిలోకి వచ్చినాక ఎంతో సేపటికిగాని నువు రాకపోతివి!" అన్నారు బ్రాహ్మణులు.

"ఒళ్లు బద్ధకంచేత నేను పరిగెత్తలేదనుకుంటున్నారులాగుంది. కాని మన పెద్దలు కొందరికి పరుగు నిషేధించారు; కిరీటమూ, రాజలాంఛనాలూ ధరించిన రాజు పరిగెత్తరాదు, అంబారీ వేసిన ఏనుగు పరిగెత్తరాదు, సన్యాసి పరిగెత్తరాదు, స్త్రీ పరిగెత్తరాదు. అందులోనూ అవివాహిత అయిన స్త్రీ అమ్మకపు సరుకులాటిది. ఆమె





పరిగెత్తి పడి చెయ్యో కాలో విరుచుకుంటే ఆమెకు గల వెల తరిగిపోతుంది," అన్నది విశాఖ. ఆమె అన్న మాటలువిని బ్రాహ్మణులు సంతోషించి, ఆమె పూర్ణవర్ధనుడికి తగిన భార్య అవుతుందని నిశ్చయించారు. వారు ఆమెతో తాము వచ్చిన పని చెప్పి ఆమె కొక విలువైన హారం సమర్పించారు. విశాఖ అంతా విని ఆ బ్రాహ్మణులను తన తండ్రి వద్దకు తీసుకుపోయింది. ధనంజయుడు బ్రాహ్మణులతో పెళ్లికొడుకు కుల గోత్రాలడిగి తెలుసుకుని, "అతనికి ఏపాటి ఆస్తి వుంటుంది?" అని అడిగాడు.

"అతని వంతు నలభైకోట్లు వస్తుంది," అని బ్రాహ్మణులు చెప్పారు.

"అది మా పిల్ల తలంటికి సరిపోదు. కాని వారు కులగోత్రాలలో మాకు తక్కువ కారు గనక నేను అతనికి నా పిల్ల నిస్తాను!" అన్నాడు ధనంజయుడు.

బ్రాహ్మణులు తిరిగివెళ్లి మిగారుడితో సమాచార మంతా చెప్పారు. మిగారుడు సంతోషించి సాకేతునగరానికి వెళ్లి తన కుమారుడికి పెళ్లి చేయించ నిశ్చయించి ఈ శుభవార్త రాజుగారి చెవినకూడా వేస్తే బాగుంటుందనే ఉద్దేశంతో రాజుగారిని చూడబోయాడు.



రాజుగారు అంతా విని, "చాలాబాగుంది. ధనంజయుడుకూడా మనకు ఆప్తుడే. అతన్ని నేనే యిక్కడికి రప్పించాను. అందుచేత పెళ్ళికి నేనుకూడా సపరివారంగా బయలు దేరి వస్తున్నాను!" అన్నాడు. మిగారుడికి గుండెలో రాయిపడ్డట్టయింది.

రాజుగారు తన సిబ్బందితో కదిలివస్తే ధనంజయుడు అందరికీ విడిది ఏర్పాట్లూ, భోజన సదుపాయాలూ చెయ్యగలడో లేడో అని మిగారుడు భయపడ్డాడు. ఆయన ధనంజయుడికి సంగతి సందర్భాలన్నీ తెలియజేస్తూ, "ఈ పెళ్లి గుట్టుచప్పుడు కాకుండా చేసినట్టయితే మీకు చాలా



ఖర్చు తప్పుతుందని నా ఉద్దేశం!" అని కబురుచేశాడు.

"పదిమంది రాజులు తమ పరివారాలతో వచ్చినా నేను భయపడేవాణ్ణి కాను!" అని ధనంజరుడు జవాబు పంపాడు. కాని మిగారుడికి ఈ మాటలు పట్టి ప్రగల్భాలుగా తోచాయి; ఈ ధనంజరుడు లేనిపోని గొప్పలకుపోయి, తన గొయ్యి తానే తవ్వుకుంటున్నాడని భయపడ్డాడు.

పెళ్ళివారు సాకేతునగరానికి తరలి వెళ్ళారు. రాజుగారు అంతులేని పరివారాన్ని వెంటబెట్టుకుని వెళ్ళాడు. ధనంజరుడు అందరికీ విడుదులు ఏర్పాటుచేసి భోజ



నాలు అమర్చాడు. ఆయన నగలు చేసే వాళ్లను పిలిచి వాళ్ళకు నౌకర్లచేత డబ్బై మానికిల వజ్రాలూ, ఇతర రత్నాలూ, ముత్యాలూ ఇప్పించి, "నా కూతురికి నగలు చేసి ఇవ్వండి," అన్నాడు.

రోజులు గడిచిపోతున్నాయి, పెళ్ళివారు విడుదులలో హాయిగా కూచుని భోజనాలు చేస్తున్నారు, కాని పెళ్ళిముహూర్తం ఎప్పుడో ఎవరికీ తెలియదు. రాజుగారు ధనంజరుణ్ణి పిలిపించి, "మమ్మల్ని ఎంతకాలం భరిస్తావు? త్వరలో ముహూర్తం చూసి, పెళ్ళి చేసి మమ్మల్ని సాగనంపరాదా?" అని సలహా ఇచ్చాడు.

"మహారాజా, మంచిముహూర్తం ఇంకా నాలుగుమాసాలదాకా లేదు. మీరు నాకేమీ బరువుకాదు. పెళ్ళి అయినదాకా మీరంతా నా ఆతిథ్యం స్వీకరించాలి. ఇదే నా ప్రార్థన!" అన్నాడు ధనంజరుడు.

ఆ నాలుగు మాసాలూ ఊరు ఊరంతా పెళ్ళి ఇల్లులాగే వుంది. అతిథులకు ఎటువంటి లోటూ జరగలేదు. వానాకాలం రావటంచేత వంటచెరుకుకు మటుకు ఇబ్బంది అయింది.

అతిథులందరికీ వంటచేయటానికి రోజుకు అయిదువందల బళ్ళ వంటచెరుకు కావాలి.



సేవకులు ధనంజయుడితో, "అయ్యా, వంటచెరుకు దొరకటం చాలా కష్టంగా ఉన్నది," అన్నారు.

"ఏనుగుల శాలలూ, గుర్రాలశాలలూ పడగొట్టి వాటి కలపను వంటచెరుకుగా వాడండి," అన్నాడు ధనంజయుడు.

నాలుగు మాసాలూ గడిచాయి. నగలు చేసేవారు పెళ్ళికూతురి నగలు తయారు చేసి పట్టుకువచ్చారు. పెళ్ళినాడు పెళ్ళి కూతురికి రత్నాలతొడుగు తొడిగారు. ఆమె ఒంటిన ఏడుకోట్ల విలువచేసే నగలున్నాయి. (అంత విలవైన నగలు ఆ కాలంలో మరి ఇద్దరు స్త్రీలుమాత్రమే ధరించినట్టు చెబుతారు: వారిలో ఒకతె సుజాత; సిద్ధార్థుడు బుద్ధుడు కాబోయేముందు ఆయనకు పాయసం తీసుకుపోయేటప్పు డామె వాటిని ధరించింది; రెండవ స్త్రీ బంధులుడనే క్షత్రియుడి భార్య. ఈ బంధులుణ్ణి గురించి ముందు ముందు తెలుసుకుంటాం.)

పెళ్లి ముగిసింది. ధనంజయుడు తన కుమార్తెకు బళ్లతో బంగారమూ, వెండీ గృహపరికరాలూ భరణం ఇచ్చాడు, ఆమెకు రక్షకులుగా ఎనిమిదిమంది బుద్ధిమంతుల నిచ్చాడు, అనేకవేలమంది దాసదాసీల నిచ్చాడు, లక్ష ఇరవైవేల గోవుల నిచ్చాడు. ఆయన రాజుగారినీ ఇతర పెళ్లివారినీ సగం దూరం సాగనంపి తిరిగి వెళ్లిపోయాడు.

మిగారుడికి ఐరావతాన్ని తెచ్చుకున్నట్టయింది. "కోడలితోబాటు ఈ పరివారమంతా కూడా ఏమిటి? వీరందరినీ నే నెలా భరించేది?" అనుకున్నాడాయన.

పెళ్లికూతురు గృహప్రవేశం చేసే సమయంలో రాజుగారూ ఇతర సామంతులూ విశాఖకు అమూల్యమైన కానుకలూ, కట్నాలూ చదివించారు. వాటన్నిటినీ ఏమి చెయ్యాలో తోచక విశాఖ, ఒకరు పంపిన వాటిని మరొకరికి బహుమానాలుగా పంచేసింది. —(ఇంకావుంది)



# వాలిడి కోతులు

తోక గల కోతులను గురించి కిందటి నెల తెలుసుకున్నాం. ఇప్పుడు తోక లేని వాలిడి కోతులను గురించి తెలుసుకుందాం.

మామూలు కోతులకన్న వాలిడి కోతులు మరింతగా మనిషిని పోలి ఉంటాయి. ఆకారాలలోనూ, శరీరధర్మాలలోనూ, కొంతవరకు బుద్ధులలోనూ వాలిడి కోతులు మనిషికి చాలా దగ్గిరగా ఉంటాయి. సామాన్యంగా అవి నిలబడి, రెండు కాళ్లమీద నడుస్తాయి, ఉండటానికి ఏవో ఒక రకమైన ఇల్లు కట్టుకుంటాయి. మనిషికి ఉన్నన్ని చేతివేళ్ళూ, కాలివేళ్ళూ, దంతాలూ వాటికి ఉంటాయి. వాలిడి కోతులకు మెదడు ఒకటే చిన్నది.

మనకు తెలిసిన మనిషిమెదడు లన్నిటిలోకీ అతి చిన్నది పెరూలో దొరికిన ఒక పురాతన మానవుడి పుర్రెలో ఉండినది. ఇందులో 910 ఘనపు సెంటిమీటర్ల మెదడు ఉండేది. ఈనాటి ఎదిగిన మనిషి మెదడు 1300 నుంచి 1900 దాకా ఉంటుంది. వీటితో పోలిస్తే గొరిల్లా మెదడు 600 మాత్రమే.

మనుషులకు వచ్చే కొన్ని వ్యాధులు—ఎపెండిసైటిస్‌లాటివి—వాలిడి కోతులకు కూడా వస్తాయి. అవి కూడా నిద్రపోయేటప్పుడు గురకపెట్టటం అప్పుడప్పుడూ జరుగుతుంది. మనిషికీ వాలిడులకూ మరొక పోలిక



"చెడును చూడము, మాట్లాడము, వినము" అనే చింపాంజీలు



రొమ్ము బాదుకునే గొరిల్లా

ఏమంటే వాటి పిండాలుకూడా నవమాసాలు తల్లి గర్భంలో పెరుగుతాయి. పుట్టినప్పుడు వాలిడి కోతి బరువు 3 నుంచి 7 పౌనులదాకా ఉంటుంది. "గిబ్బన్"లు అనే వాలిడులు మాత్రం తల్లి గర్భంలో ఏడు మాసాలే ఉంటాయి.

గొరిల్లాలూ, చింపాంజీలూ, ఒరాంగుటాన్‌లూ, గిబ్బన్‌లూ—ఇవి పెద్ద వాలిడులు.

అన్నిటిలోకీ భారీ అయినది గొరిల్లా. ఈ జాతిలో 600 పౌనుల బరువును మించినవి కూడా ఉన్నాయి. వీటి చేతులు చాలా దీర్ఘంగా—చింపాంజీల చేతులకంటె కూడా పొడవుగా—ఉంటాయి. వీటి కనుబొమలు ముందుకు పొడుచుకు వస్తాయి. వీటి రొమ్ములు విశాలంగా ఉంటాయి, పొట్టలు పెద్దవి. ఇవి తమ వేళ్లను ముడిచిపట్టి నాలుగు కాళ్లపైన, వేళ్ల కణుపులు నేలపై మోపుతూ, నడుస్తాయి, కాని కావాలన్నప్పుడు గొరిల్లా మిగిలిన వాలిడులన్నిటికన్న ఎక్కువ నిటారుగా లేచి నిలబడగలదు. సంతోషంగాని, కోపంగాని, ఉద్రేకంగాని వచ్చినప్పుడూ, ఏదైనా భయంకలిగినప్పుడు, తన జాతివాటిని హెచ్చరించటానికి అది నిలబడి చేతులతో రొమ్ము బాదుకుంటుంది.

గొరిల్లా చెవులు చింపాంజీ చెవులకన్న చిన్నవి. దాని కళ్లు లోతుగానూ, ప్రశాంతంగానూ ఉంటాయి.

వాలిడి కోతులు పశ్చిమార్ధగోళంలో లేవు. అందుచేత పాశ్చాత్యులు నూరేళ్ల క్రితందాకా గొరిల్లాలను చూడలేదు. ఆఫ్రికావాసులు గొరిల్లాలను పాతకాలపు తుపాకులతో వేటాడబోతే అవి ఆ తుపాకుల గొట్టాలను పట్టుకుని

గుండ్రగా మెలికెలు తిప్పేసేవని చెబుతారు. గొరిల్లా అంత బలంగలది కూడానూ. అందు చేతనే అరణ్యాలలో అవి ఉండే చోట వాటికి అపాయం కలిగించే సహజ శత్రువులు దాదాపు ఏమీ లేవు, మామూలు ఘాతుక మృగాలు దానిజోలికి రాలేవు. అడవిదున్నల వంటివి గొరిల్లాల జోలికి రావు. గొరిల్లాలు వాటిజోలికీ పోవు. ఎప్పుడైనా చిరుతలు పిల్ల గొరిల్లాలను ఎత్తుకుపోవచ్చు. కాని పెద్దవాటి చాయలకు వెళ్లవు. సింహాలుండే ప్రాంతాలలో గొరిల్లాలు నివసించవు గనక వాటికి సింహాల భయం లేదు.

అపారమైన శరీరబలమూ, భయంకరమైన కోరలూ ఉన్నప్పటికీ గొరిల్లా ప్రధానంగా శాకాహారి. ఎప్పుడైనా అది పిట్టలనూ, పక్షుల గుడ్లనూ తింటుందేమో.

ఇటీవల పాశ్చాత్యులు బెల్జియన్ కోంగోకు వెళ్లి గొరిల్లాల సహజ జీవితాన్ని వివరంగా పరిశీలించారు. అడవులలో గొరిల్లా కుటుంబాలు సంచారజీవితం గడుపుతాయి. మిట్ట మధ్యాన్నపు వేడిసమయంలో పెద్ద గొరిల్లాలు విశ్రాంతి తీసుకుంటాయి, పిల్లలు ఆడుకుంటాయి. రాత్రివేళ నేలపైన ఆకులతో పాదలు నిర్మించుకుని గొరిల్లాలు వాటిలో నిద్రపోతాయి. "తండ్రి" గొరిల్లా మాత్రం ఏ చెట్టుమానుకైనా వీపుపెట్టి కూచుని నిద్ర పోతుంది.

ఒక్కొక్కప్పుడు ఆడ గొరిల్లాలూ, పిల్లలూ చెట్లకొమ్మలలో కూడా పడుకుంటాయి.

తెల్లవారగానే అవి ఆహారాన్ని వెతుక్కుంటూ బయలుదేరతాయి. అవి మొక్కలు పీకి వాటి వేళ్లను తింటాయి. కొన్ని అడవి



గొరిల్లా బలశాలి

ఆకులూ, వెదురుచిగుళ్ళూ, నేరేడుకాయలూ వాటికి చాలా ఇష్టం. అవి పెద్ద మొత్తాలలో ఆహారం తినేవి గనక ఒక చోట నిలవక సంచారజీవితం గడుపుతాయి.

పాశ్చాత్యులు మొదట్లో గొరిల్లాలను పట్టి పెంచలేకపోయారు. కాని ఇప్పుడవి జంతు ప్రదర్శనశాలలలోనూ, సర్కసుల వెంటా ఉంటున్నాయి. కొన్ని ఇళ్లలోకూడా పెరుగుతున్నాయి. శాన్ డియేగో జంతుప్రదర్శనశాలలో 602 పౌనుల బరువుగల మగ గొరిల్లా ఉన్నది. బార్నమ్, బెయిలీ సర్కసు వెంట 500 పౌనుల బరువు గల "గార్గాంటువా" అనే పేరుగల గొరిల్లా ("ప్రపంచంలోకెల్లా భయంకరమైన సజీవమృగము") ఉండేది. ఇంత "భయంకరమైన" జంతువు కూడా చిన్న పామును చూపిస్తే వణికిపోయేది. అది తన బోనులోకి వెళ్లక మొరాయించినప్పుడు దాని కొక పామును చూపించేవారు, వెంటనే అది తన బోనులోకి పారిపోయేది.

నిర్బంధంలో ఉండే గొరిల్లాలకు చిన్నపిల్లలు తినదగినవన్నీ—చేపనూనే, పాలూ, పళ్ళూ, నారింజపళ్ల రసం, కూరలూ, గుడ్లూ, ఎప్పుడైనా చిన్న మాంసంముక్కలూ, రొట్టె మొదలైనవి—పెడతారు.

గొరిల్లాల తరవాత చెప్పదగినవి చింపాంజీలు. గొరిల్లాలు భీకరంగా ఉంటే, చింపాంజీలు నవ్విస్తాయి. ముఖ్యంగా పిల్ల చింపాంజీలు అమిత చలాకీగా ఉండి, అస్తమానం "కోతి పనులు" చేస్తాయి. ఇవి చాలా తెలివిగాకూడా ఉంటాయి. నిర్బంధంలో ఎక్కువగా మనం చూసే వాలిడి కోతులు




చెట్లమీద చింపాంజీ కుటుంబం

ఇవే. అవి అరణ్యాలలోకూడా గొరిల్లాల కన్నా, ఒరాంగుటాన్లకన్నా అధిక సంఖ్యలో ఉంటాయి.

ఇవి విరివిగా దొరకటంవల్లా, సులువుగా మచ్చిక కావటంవల్లా, త్వరగా ఏపని పడితే ఆపని చేయటం నేర్చుకోవటంవల్లా వీటిని సర్కసులలోనూ, కార్నివాల్ లలోనూ, సినిమాలలోనూ అధికంగా ఉపయోగిస్తారు. "టార్జాన్" చిత్రాలలో మనం చూసే కోతులు చింపాంజీలే. మన దేశపు చిత్రాలలో కూడా నటించిన "జిప్పీ" ఒక చింపాంజీ కోతి. ఈ కోతులు అయిదారేళ్లు దాటినాక చెప్పినమాట వినవు, అప్పుడు వాటిని ప్రదర్శనలలో ఉపయోగించరు.

చింపాంజీపిల్లలు మనుషులు చేసే పనులు నేర్చుకున్నంత సులువుగా మరే జంతువూ నేర్చుకోలేదు. అవి బల్లలముందు కూచుని ఆహారం తినటమూ, కూజాలోనుంచి పాలు గాని నీరుగాని గ్లాసులలో పోసుకోవటమూ, సైకిళ్లు తొక్కటమూ, తోపుడు బళ్లు తోయటమూ, మొదలైన అనేక పనులు నేర్చుకోగలవు. వాటికి గెంతటమూ, చప్పట్లు చెయ్యటమూ, వస్తువులు విసిరివెయ్యటమూ మొదలైన చిలిపి పనులు సరదా.

ఆఫ్రికాలోని భూమధ్యరేఖ ప్రాంతంలో విస్తృతంగా చింపాంజీలు నివసిస్తున్నాయి. గొరిల్లాలలాగే ఇవి అడవులలో కుటుంబాలుగా నివసిస్తాయి. ఒక్కొక్కప్పుడు 25 లేక 30 చింపాంజీ పిల్లలు కలిసి సంచరిస్తాయి. ఇవి గొరిల్లాలకంటె ఎక్కువకాలం చెట్లపైన గడుపుతాయి. గొరిల్లాలకూ చింపాంజీలకూ గల ముఖ్యమైన తేడా లేవంటే—ఇవి గొరి



చిన్న చింపాంజీలు సర్కసుపనులు చేస్తాయి

ల్లాలకన్న చిన్నవి; ఆడ చింపాంజీకీ, మగ దానికీ ప్రమాణంలో గొరిల్లాలలో ఉన్నంత వ్యత్యాసం ఉండదు; కనుబొమలు పొడుచుకురావు; ముక్కులు చాలా తేడాగా ఉంటాయి; అవి గొరిల్లాలకంటెకూడా బాగా నిలబడి నడుస్తాయి. గొరిల్లాలకంటె ఎంతో చలాకీగా ఉంటాయి, వీటికి పెద్ద పొట్టలుండవు.

చింపాంజీలను పెంచేవారు గొరిల్లాలకన్న వీటికే ఎక్కువ వ్యక్తిత్వం ఉన్నట్టు భావించి, వీటికి మనిషి పేర్లే సాధారణంగా పెడతారు. చిన్నతనంనుంచీ వాటికి బల్లముందు కూచుని చెంచాలతోనూ, కత్తులతోనూ, ఫోర్కులతోనూ తినటం నేర్పుతారు.

ఒరాంగుటాన్లుకూడా గొరిల్లాలలాగే చాలా తక్కువ సంఖ్యలో ఉన్నాయి. ఇవి బోర్నియో ద్వీపంలోనూ, సుమత్రాలోని రెండు ప్రాంతాలగల అడవులలో ఉన్నాయి. ఇవి అంతరించిపోకుండా అక్కడి ప్రభుత్వం చాలా కట్టుదిట్టాలు చేసింది. ఒరాంగుటాన్ అంటే మలయాదేశపు భాషలో "అడవిమనిషి" అని అర్థం. కాని బోర్నియోలో వీటిని "మ్యా"లు అనీ, "మావా"లు అనీ పిలుస్తారు.

ఒరాంగుటాన్లు కూడా ఇతర వాలిడుల లాగే కుటుంబాలుగానే జీవిస్తాయి. అయితే అవి సాధారణంగా చెట్లు దిగిరావు. నేలపైన అవి సరిగా సంచరించలేవు. అవి చెట్లమీద కర్రలతో కట్టుకునే ఇళ్లు చూస్తే కాకిగూళ్లు నయమనిపించేటట్టుగా ఉంటుంది. అందులో కూచుని కోతులు వానకు తడిసిపోతాయి.

చింపాంజీ పిల్లలకంటెకూడా ఒరాంగుటాన్ పిల్లలు సాధువులు. పెంచుకోవటాని కవి




ఉరాంగుటాన్ కోతులు ఇతర కోతులతో కలవవు

చాలా బాగుంటాయి. సుమత్రాలో చాలా మంది ఒరాంగుటాన్ పిల్లలను పట్టుకుని వాటిని పాకి అనేక విద్యలు నేర్పుతారు. పూర్వం వీటిని పట్టుకోవటానికి తల్లులను నిర్దాక్షిణ్యంగా చంపటమూ, ఇవి ఉండే చెట్ల కింద మంటలు పెట్టటమూ మొదలైన హింసలు చేసేవారు. ఒక పెద్దమనిషి ఏ హింసా చెయ్యకుండానే ఒక పిల్లను పట్టుకున్నాడు. అపిల్ల ఒక చెట్టుపైన కనిపించింది. ఆయన ఆచెట్టు సమీపంలో ఉన్న చెట్లను కొట్టించాడు. పిల్ల ఇంకొక చెట్టుమీదికి వెళ్లటానికి దిగి నేలమీద నడవవలిసివచ్చింది. ఆ సమయంలో దానిపైన వల వేసి పట్టారు.

ఒరాంగుటాన్లుకూడా బలిష్ఠమైనవే. అవి ఇతర కోతులపట్ల ఏమాత్రమూ ఆసక్తి చూపవు.

గొప్ప వాలిడులు అనబడేవాటిలో చేరినవే అయినా గిబ్బన్ కోతులు చిన్నవే. చేప నీటిలో ఎన్ని రకాల ఫీట్లు చేస్తుందో, గిబ్బన్లు చెట్ల మీద అన్ని రకాల ఫీట్లు చేస్తాయి. అవి సామాన్యంగా చెట్లు దిగవు, దిగాయంటే ఇతర చెట్లపైకి పోవటానికే. ఆఖరుకు దాహం అయినప్పటికీ, అవి చెట్ల తొర్రలలో నిలిచే వాననీటిలో చేతులు ముంచి ఆ చేతులను నాకి దాహం తీర్చుకుంటాయి. నిర్బంధంలో ఉన్నప్పుడుకూడా వీటికీ అల వాటు మారదు.

గిబ్బన్ కోతులు అగ్నేయాసియాలోనూ, కొన్ని తూర్పు ఇండియా దీవులలోనూ ఉన్నాయి. ఇవి ఎంతెంత ఎత్తుగల చెట్లపైన ఉంటాయంటే వాటిని చూస్తుంటే తల తిరిగి పోతుంది. ఇవి ఒక కొమ్మనుంచి ఇంకొక



గిబ్బన్ కోతి కంఠధ్వని ఫిడేలు మోతలాగా వుంటుంది

కొమ్మకు ఎగురుతూంటే గాలిలో ఈదుతున్నట్టుగా ఉంటుంది. ఇవి ఒక్కొక్కసారి 20, 30 అడుగులు నిలువుగా పడి కింద నున్న కొమ్మను అందుకుని ముందుకు సాగిపోతాయి. ఇవి నిర్బంధంలో ఉన్నప్పుడుకూడా అస్తమానం మొగ్గలు వేస్తూ, ఫీట్లు చేస్తూనే ఉంటాయి. వీటి చేతులు ఎంత పొడవుగా ఉంటాయంటే అవి నేలపైన నడిచేటప్పుడు చేతివేళ్లు దాదాపు నేలకు తగులుతాయి. చెట్లపైన వీటి వేగం చెప్ప నలవికాదు. అవి ఎగిరే పిట్టలనుకూడా అందుకోగలవని చెబుతారు.

గిబ్బన్లు పళ్ళూ, కాయగూరలూ కాక పక్షులగుడ్లు తింటాయి, కొన్నికొన్ని కీటకాలనుకూడా తింటాయి. గిబ్బన్‌పిల్లలు పెంచుకోవటానికి చాలా బాగుంటాయిగాని వీటిని సాకటం కష్టం. అవి నాలుగైదేళ్ళలోపుగా చనిపోతాయి. చాలాకాలం బతికిన గిబ్బన్లు కూడా లేకపోలేదు.

చెట్లమీద అంత అవలీలగా ఎంతోదూరం గెంతగల గిబ్బన్ కోతులు నేలపై అలాటి ఫీట్లు చెయ్యలేనట్టు కనిపిస్తుంది.

గిబ్బన్ కోతులన్నిటిలోకీ పెద్దవి "సియమాంగ్" కోతులు. "సియమాంగ్" అంటే బటక్ భాషలో "నాన్నగారు" అని అర్థం. వీటి కాళ్ళ రెండవ, మూడవ వేళ్ళమధ్య "జాలం" ఉంటుంది. ఇంకొక విశేషమేమంటే వీటి కంఠాలకు పెద్ద తిత్తి ఉంటుంది. దాని నిండా గాలి పూరించి ఇవి పెద్ద కీచుమోతతో దీర్ఘమైన కేక పెడతాయి.

గిబ్బన్ కోతులు ఎన్నడూ నాలుగు కాళ్లపై నడవవు.



ఈ గిబ్బన్ కోతి కంఠంలో తిత్తివున్నది; దీని కేక మైలుదూరానికి వినిపిస్తుంది




1. *రాధా గోవింద్ పాఢీ, పార్వతీపురం*

**మామా! పాఠకుల అభిప్రాయాలు తెలుసుకొని ప్రతి సంవత్సరము ఒక ప్రత్యేకత ప్రవేశపెట్టుండాలి. అంతేగానీ, చందమామకే కళంకం వున్నదిగదా, నాలో ఆమాత్రం వుంటే ఫరవాలేదని అశ్రద్ధ చేయవుగదూ?**

ఆ చందమామలో కళంకాన్ని ఎవరూ సరిదిద్దలేరు గాని ఈ "చందమామ"లో కళంకం ఏర్పడితే వెంటనే సరిదిద్దేవారు ఎన్ని లక్షలమందో ఉన్నారుగదా, అల్లుడా!

2. *వేముల కుటుంబరావు, చీరాల*

**రాకెట్‌ను మొట్టమొదట కనిపెట్టిన శాస్త్రజ్ఞుడెవరు? వారి నామధేయం?**

రాకెట్‌ను ఎవరు ఎప్పుడు కనిపెట్టారో మనకు తెలియదు. అతి ప్రాచీన కాలం నుంచీ అవి చీనాలో ఉండినట్టు తెలియవస్తున్నది. వారు "అగ్ని" అస్త్రాలని యుద్ధాలలో ఉపయోగించేవారు. వాటి వర్ణనను బట్టి అవి రాకెట్లని బోధపడుతున్నది. ఒక్క విషయం రూఢిగా చెప్పవచ్చు. పాశ్చాత్యులకన్న ముందు మన భారతీయులకు రాకెట్లు తెలుసు. పాశ్చాత్యులు మొదటగా భారతీయులతో యుద్ధాలు చేసినప్పుడు భారతీయుల రాకెట్ అస్త్రాలు పాశ్చాత్యులలో చాలా విధ్వంసం కలిగించాయి. మననుంచే రాకెట్లు పాశ్చాత్యదేశాలకు చేరాయి.

3. *"మాధవరవు", అలమూరు*

**విదేశాలు విజ్ఞానవీథులలో విహరిస్తుంటే మన దేశం మాటుమణిగి ఉండ డానికి కారణం?**

మన దేశం స్వతంత్రమై ఎంతోకాలం కాలేదు. ఈ కాలపు యువతీయువకులు తమను తాము ఇలా ప్రశ్నించుకున్నట్టయితే మన దేశం విజ్ఞానవీధిలో విహరించటానికి ఎంతోకాలం పట్టదు.

4. *జి. ఎ. లింగప్ప, రాబర్ట్‌సన్ పేట, కోలారు*

**బేతాళ కథలు చాలా బావున్నాయి, కాని మీరుమాత్రం కల్పితం కథలు ప్రకటిస్తున్నారు, కారణం ఏమిటండీ?**

అసలు బేతాళ కథలు 25 మాత్రమే ఉన్నాయి. వాటిలో ప్రచురణయోగ్యమైనవాటిని ప్రచురించాము. రెండు మూడు కథలు మామూలు కథలుగా కూడా "చందమామ"లో లోగడ వెలువడ్డాయి. ప్రస్తుతం కల్పిత బేతాళ కథలు ప్రచురిస్తున్నాము. వీటిని మా పాఠకులు చదివి ఆనందిస్తున్నట్టు వారి లేఖలు స్పష్టంచేస్తున్నాయి.

5. *తోట పద్మారావు, సికిందరాబాదు*

**ఆహారము భుజించునపుడు కోపము, విచారము కూడదంటారు పెద్దలు. ఆహారమునకు, కోప విచారములకు గల పరస్పర సంబంధమేమి ?**

ఆహారం జీర్ణం కావటానికీ కోప విచారాలకూ చాలా సంబంధం ఉన్నది. ఉద్రేక పూరితుడై ఉన్న మనిషి ఆహారాన్ని జీర్ణించుకోలేడు. కొన్ని కొన్ని ఉద్రేకాల ఫలితంగా జీర్ణ కోశంలోని స్రావాలు మార్పుచెందుతాయి. అదీగాక ఆహారం తిన్నమనిషికి రక్తం మెదడులో తక్కువగానూ, జీర్ణకోశంలో ఎక్కువగానూ ప్రసారం కావాలి.

6. *సి. హెంపోకుమార్, అలువాల్*

**మా ఊరికి "చందమామ" రావడంలేదు. కారణం ఏమిటి? మాకు వెన్నెల కావాలంటే మేము ఏంచెయ్యాలి ?**

మీ ఊరిలో "చందమామ"కు ప్రతినిధి లేడులాగుంది. చందా కట్టినట్టయితే "చందమామ" నెలనెలా మీరున్నచోటికే వస్తుంది.

8. *ఎస్. నాగేశ్వరావ్, జయపురం*

**"చందమామ"కు 6 మాసముల కొకసారి సంవత్సరం నిండుతుంది, కారణం ?**

అని ఎవరన్నారు ? "చందమామ"కు ఏడాదికి రెండు సంపుటాలు పూర్తి అవుతాయి, రెండేళ్లు కాదు.

9. *తేతల వెంకట సత్యనారాయణరెడ్డి, పెనుగొండ*

**షేక్స్పియరు కథలు చాలా బాగుగానున్నవి. కనుక ఒకసారి విలియం షేక్స్పియరు పటమువేసి, పాఠకులకు పరిచయము చేయుదురని ఆశించుచున్నాను.**

షేక్స్పియర్ కాలంనాటికి ఫొటోగ్రఫీ లేదు. ఆయన శిలలు ఒకదాన్ని ఒకటి పోలిలేవు. షేక్స్పియర్ రూపచిత్రమూ, జీవిత కథా దీపావళి (నవంబరు) సంచికలో చూడండి.




రోగి : డాక్టరుగారూ, నాకు ప్రతిమనిషి ఇద్దరుగా కనిపిస్తారండి! వైద్యం చెయ్యగలరా?
డాక్టరు : ఈ భాగ్యానికి ముగ్గురు రావాలా? (పంపినది : శ్రీ కె. నాగేశ్వరరావు, వాల్తేరు.)




యజమాని : ఎవరన్నా వస్తే నాకు సుస్తీగావుందని చెప్పమనలేదూ?
నౌకరు : ఈ వచ్చినాయన డాక్టరండి. అందుకని తప్పక మిమ్మల్ని చూడాలంటున్నారు.

## 5. సెంట్రల్ గ్లాస్ అండ్ సిరామిక్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ - కలకత్తా

మన దేశానికి అవసరమైన గాజు (గ్లాసు) మన దేశంలో ఉత్పత్తి కావటంలేదు. ముఖ్యంగా కళ్ల అద్దాలకూ, లెన్సులకూ మొదలైనవాటికి కావలసిన గాజు పూర్తిగా బ్రిటను, ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీ, అమెరికాలనుండి దిగుమతి చేసుకుంటున్నాం. అలాగే మేలురకం పింగాణీ కూడా దిగుమతి అవుతున్నది. ప్రతి పరిశ్రమలోనూ మేలురకం గాజూ, పింగాణీ అత్యవసరం.

వీటి వుత్పత్తిగురించి పరిశోదనలు చెయ్యటానికిగాను కలకత్తాలో సెంట్రల్ గ్లాస్ అండ్ సిరామిక్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ నిర్మాణమై, 1950 అగస్టు 26 న ప్రారంభించబడింది. ఇక్కడ అన్ని రకాల గాజునూ కొద్ది ప్రమాణంలో చేయటానికిగాను అధునికమైన బట్టీలూ, ఇతర ఉపకరణాలూ, గాజును పరీక్షించే సరికొత్త యంత్రాలూ ఉన్నాయి.

ఈ సంస్థ నిర్వహించే పనులు : రకరకాల గాజూ, పింగాణీ ఉత్పత్తి చెయ్యటంగురించి పరిశోధనలు సాగించటం; వాటిని పరీక్షించి ప్రమాణాలు నిర్ధారించటం; పరిశ్రమలకు సాంకేతిక సహాయం చెయ్యటం; సాంకేతిక విషయాలను ప్రచురించటం : తగినవారికి శిక్షణ ఇవ్వటం. ఈ సంస్థ దేశంలో లభించే ముడిపదార్థాలనుగురించి పరిశోధనలు జరిపింది.

ఇక్కడ శిక్షణ పొందినవారి సహకారంతో దుర్గాపూర్‌లో త్వరలోనే ఒక "ఆప్టికల్ గ్లాస్" ఫాక్టరీ నిర్మాణం కాబోతున్నది. సోవియెట్ రష్యా సహాయంతో ఏర్పడబోయే ఈ ఫాక్టరీలో ఏటా 200 టన్నుల గాజు—కళ్లజోళ్లు వగైరాలకు పనికివచ్చేది—ఉత్పత్తి అవుతుంది.





# వినోదాలు

కొత్తగా పట్టణానికి బదిలీ అయిన పెద్దమనిషి తన పొరుగింటి ఆయనతో, "ఇక్కడికి వచ్చినప్పటినుంచీ డాక్టరుకింద ఒకటే ఖర్చు! మా ఊళ్ళో అన్నేళ్ళు ఉన్నా ఒక్క కానీ డాక్టరుకిచ్చి ఎరగం ?" అన్నాడు.

"అవునుట! మీ ఊరి డాక్టరు నాతో అన్నాడు. ఆయన మా బంధువే లెండి!" అన్నాడు పొరిగింటి ఆయన.

*  *  *

తండ్రి (చదువుకుంటున్న కొడుకుతో): మీ క్లాసులో నువ్వు ఎప్పుడూ ఆఖరుస్థానంలోనే ఉంటున్నావు ? మిగిలిన స్థానాల్లో ఇంకొకటి నీకు చిక్కటం లేదురా ?

కొడుకు: మిగిలిన స్థానాలన్నిటిలోనూ ఎవరో ఒకరు ఉంటూనే ఉన్నారు, నాన్నా!

*  *  *

ఒక రాజుగారికి తననుగురించి ప్రజ లేమనుకుంటున్నారో తెలుసుకోవాలనిపించింది. ఆయన మారువేషం వేసుకుని ఒక గ్రామంలోని రచ్చబండవద్దకు వెళ్లాడు. అక్కడ చాలా మంది రైతులూ, ఇతర గ్రామస్తులూ ఉన్నారు. రాజు ఒకణ్ణి సమీపించి, "మీ రాజు గురించి మీ ఊరివాళ్ల ఉద్దేశమేమిటి ?" అని అడిగాడు.

ఆ రైతు అటూ, ఇటూ చూసి, తనవెంట రమ్మని రాజుకు సైగచేసి పొలాలమధ్యకు బయలుదేరాడు. మారువేషంలో ఉన్న రాజు అతడి వెనకగా వెళ్ళాడు. నిర్జనప్రదేశంలోకి వెళ్లాక రైతు రాజుతో రహస్యంగా, "నన్నడిగితే రాజుగారు మంచివాడే నంటాను!" అన్నాడు.

*  *  *

మేనేజరు (గుమాస్తాతో): నువ్వు జబ్బుపడ్డావనీ, అఫీసుకు రాలేవనీ ఎవరో టెలిఫోనుచేశారే?

గుమాస్తా: వెధవ! రేపు టెలిఫోను చెయ్యమంటే ఇవాళే చేశాడా ?

*  *  *

రైళ్లే రాకపోకల అసమర్ధతనుగురించి విచారణ జరపటానికి జరగవలిసిన సమావేశం, రైళ్లు సకాలంలో రాని కారణంచేత, అనుకున్న రోజునగాక మర్నాటికి వాయిదావేయబడింది.

*  *  *

భర్త (ఆగ్రహంతో): ఈ డ్రైవరువెధవను తీసిపారెయ్యాలిసిందే! వాడు మళ్లీ ఇవాళ నన్ను చంపినంతపని చేశాడు.

భార్య: పాపం, వాడికి ఇంకొక్క అవకాశం ఇద్దురూ!

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1959 నవంబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ సెప్టెంబర్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వెలుగుల రాణీ!

రెండవ ఫోటో : నీదే బోణీ!

పంపినవారు : రెడ్ల పద్మరాజు, III ఫారం, C/o ఆర్. శేషగిరిరావు, గొల్లప్రోలు, (తూర్పుగోదావరి జిల్లా).

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒక రోజున దాసూ, వాసూలు పండ్ల తోటలోకి వెళ్లి, సంచీ నిండుగా కాయలు కోసి, దాన్ని చెట్టుకింద పెట్టి, బంతి ఆట ప్రారంభించారు. బంతి అల్లంత దూరంలోవున్నపొదలో పడింది. ఆ సమయంలో పండ్లబుట్టతో అటుగావస్తున్న కొంటెకుర్రాడొకడు, పొదలో పాము వుందనీ, బంతిని బయటికితెస్తే దాసూ, వాసూలు తమ కాయల్లో కొన్ని తనకు ఇవ్వాలనీ అన్నాడు. దాసూ, వాసూలు సరేనన్నారు. కొంటెకుర్రాడు పొదలో చెయ్యి పెట్టేసరికి, 'టైగర్' చెయ్యి పట్టుకున్నది. కుర్రాడు తారెత్తిపోయి, "అయ్యో బాబో, పాము, పాము!" అంటూ పారిపోయాడు. దాసూ, వాసూలు వాడు వదిలిన పండ్లబుట్టతో ఇంటికి వెళ్లారు.






**Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd. and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'**

# ఎక్కడ విన్నా న్యూట్రిన్ ప్రశంసే!




పిల్లలకు న్యూట్రిన్ "డ్రమ్" అంటే ఎంతో యిష్టం. ఏమంటే, న్యూట్రిన్ కంపెనీవారు అందముగా ప్యాక్ చేయుటలో కొత్త పద్ధతిని అవలంబిస్తున్నారు. అత్యంత రుచికరమైన న్యూట్రిన్ మిఠాయిలు, టాఫీలు ఒక అకర్షణీయమైన పెట్టెలో అమర్చబడిన్ని, ఖరీదు హెచ్చింపబడక, మామూలు వెలకే అన్ని చోటులందు లభిస్తున్నవి.






మీ మధురానందమునకు :
ది న్యూట్రిన్ కన్ఫెక్షనెరీ కంపెని,
ప్రైవేట్ లిమిటెడ్.
చిత్తూరు - (ఆంధ్ర ప్రదేశ్)

---

# రాలెను మించిన సైకిల్ మీరు కొనలేరు

# రాలె






ప్రపంచ ప్రసిద్ధి గాంచిన సైకిల్




SRC-53 TE

# బిన్నీవారి కాట్స్‌వాల్

## ఆశ్చర్యకరమైన బట్ట, రాత్రిపూట వెచ్చగా ఉండి పగలు హాయినికలిగిస్తుంది

కాట్స్‌వాల్ సాటిలేని విలువకలది, కారణం...
అతి జాగ్రత్తగా, శాస్త్రీయమైన పద్ధతులలో శ్రేష్ఠమైన ఉన్ని, నూలు కలిపి అది తయారుచేయబడింది.

చాలాకాలం మన్ని మెత్తగా, మృదువుగా వుంటుంది. ప్రత్యేకించి పాపలకు, పిల్లలకు తగినది. మృదువైన చర్మానికి ఎంతమాత్రం హాని చేకూర్చదు. చట్టునకగ్గే ఉష్ణోగ్రత మార్పులకు రక్షణకలిగిస్తుంది. ఎప్పుడూ కళ్లు జిగేల్‌మనేటట్టు అందంగాను ప్రతి కాలానికి తగినట్టుగా వుంటుంది. ఇంటిలోనే ఉతుక్కోవచ్చు.

కాట్స్‌వాల్ తీసిపోదని హామీ యిస్తున్నాము.

రకరకాల రంగులు అద్దకాలు చెక్కులు మరి టార్టానులలో మీకు నచ్చినవి తీయండి.

కాట్స్ వాల్‌ను పోలినదిలేదు.

ఎక్కువ వెచ్చదనానికి బిన్నీవారి హెవియర్ ఊల్ మరి నూలు బట్ట- అంగోలా ధరించండి. ముద్దులొలికే పలురంగులు.

చలిపెట్టే రాత్రులందు వెచ్చదనం కలిగిస్తుంది





రోజంతా హాయిగా జలజల్లాడుతూంటాడు.







మా అనుమతిపొందిన ఏ వర్తకుని వద్దైనా కాట్స్‌వాల్ మార్కు గమనించి మీకు కావలసిన కాట్స్‌వాల్ కంట్రోలు రేటుకు కొనండి.



బెంగుళూర్ వులెన్, కాటన్ & సిల్కు మిల్స్ కంపెనీ, లిమిటెడ్. అగ్రహారం రోడ్డు, బెంగుళూరు 2
మేనేజింగ్ ఏజంట్లు: బిన్నీ & కంపెనీ (మద్రాసు) లిమిటెడ్

BY 628 a,


ధైర్యశాలి రాము,
డంబాల రంగా




అగు! ఎక్కడనుంచైనా నిచ్చెన తెస్తాను


మహా కష్టమనుకున్నావా! ఒక్కగంతులో దానిని తెస్తా! అదేమీ లెక్కలేదు...


"---నేను తరుచుగా పెద్ద కొబ్బరిచెట్ల నుంచి టెంకాయలు తెంపాను...


":---ఒక మాటు, గెద్ద, గడియార స్తంభంలో చిక్కుకొన్నది, నేను వేగంగా పైకెక్కి దానిని విడిపించాను...


":---మొదట టెన్‌సింగు తలపెట్టి యుండకపోతే నేను హిమాలయా శిఖరంమీద త్రివర్ణపతాకాన్ని నిలిపియుందును!





DL/P. 2A-50 TL

Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

నీదే బోణీ!

పంపినవారు:
ఆర్. పి. రాజు - గొల్లప్రోలు

